# హనుమత్సందేశం



"అభయం వరదం దోర్భ్యాం కలయే మారుతాత్మజం"

భాషాప్రవీణ :

రాయప్రోలు రథాంగపాణి

ఓం నమో భగవతే వేంకటేశాయ
ఓం నమో భగవతే వాయునందనాయ॥



ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానమువారు "దైవ సంబంధమైన పుస్తక ప్రచురణకై రచయితలకు యిచ్చు ఆర్థిక సహాయముతో" ప్రచురించడమైనది.

"భాషాప్రవీణ"
రాయప్రోలు రథాంగపాణి

వెల రు. 25-00

చిత్రభాను వైశాఖం
మే - 2002

PLACED ON THE SHELF
Date..........

ప్రతులు : 1000

-: ప్రతులకు :-

" భాషాప్రవీణ "

**రాయప్రోలు రథాంగపాణి**

గ్రేడ్ I తెలుగు పండిట్
జిల్లాపరిషత్ హైస్కూల్,
కొల్లూరు - 522 324.
గుంటూరు జిల్లా.
ఫోన్ నెం. 08644 - 42001

SRI VENKATESWARA
CENTRAL LIBRARY &
RESEARCH CENTRE,
Acc. No. 56040
Date..........
TIRUPATI.

ముద్రణ : న్యూ విజయ ఆర్టు ప్రెస్ - తెనాలి.

శ్రీః

మహాగణాధిపతయేనమః

ఓం నమో భగవతే వాయునందనాయ

# హనుమత్సందేశం

## అవతార విశిష్టత

సీతారామ గుణగ్రామ పుణ్యారణ్య విహారిణౌ।
వందే విశుద్ధ విజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ ॥

అనేకములైన పెద్ద పెద్ద కొమ్మలతో చాల దూరం విస్తరించి యున్న ఒక పెద్ద మఱ్ఱిచెట్టును ఆశ్రయించి ఎందరో అనాథలు ఎండబారి పడకుండ తల దాచుతుంటారు. నానాజాతి పక్షులు నలు దిక్కులకు మేతకై వెడలి సాయం సమయాన ఆ చెట్టుకొమ్మలపై నివసిస్తుంటాయి. ఎవరికీ ఏ హానీ చేయని ఆ నోరులేని పక్షులను అదే చెట్టు ఊడల మాటున పొంచి కొందరు కిరాతులు తమకాహారంగా హింసిస్తారు. కొందరు రకరకాలైన జీవన సమస్యలతో పోరాడలేక నిరాశా నిస్పృహలకులోనై-ఆ చెట్టు ఊడలనే ఉరిత్రాడుగ చేసుకుని ప్రాణత్యాగం చేస్తారు. చిత్రం ఏమంటే- వీరిలో ఎవరిని గురించీ అంటే తన చెంతన జరిగే హింస, అహింసల గురించి ఇసుమంతైనా పట్టించుకోక ఆ మఱ్ఱిచెట్టు తన పని తాను చేసుకుపోతుంది. ఇదే సృష్టి! ఇదొక సృష్టి రహస్యం!!

1)

ఐతే మానవుడు మాత్రం యీ సృష్టిని తనకనుకూలంగా కావలసిన రీతిలో మార్చుకోవాలనే తపనతో మనసు నిలుపుకోలేక కష్టనష్టాల కడలిలో కొట్టుకుపోతూ సాయానికై పరితపిస్తున్నాడు.

దైవ సృష్టిలో తరతమ భేదాలు లేవు. పక్షపాతం లేదు. అందరూ సమానమే. అందరినీ ఒకేలా చూస్తాడు.

తనను తిరస్కరించినవానిని సైతం దగ్గరకు చేర్చుకుంటాడు. సేద దీరుస్తాడు. తన తప్పు తాను తెలుసుకుని బాగుపడాలనే భావనతో మానవునికి తోడుగా అవతార పురుషులను పంపుతాడు. ఒక్కొక్క వేళ తానే అవతార మూర్తిగా అవతరిస్తాడు.

అట్టి మూర్తులలో హనుమన్మూర్తి ప్రతిభావంతమైనదీ, మహా మహిమాన్వితమైనదీనూ—

ఆంజనేయస్వామివారి జనన, విద్యాభ్యాసాది విధానమంతా మానవజాతికి ఒక సందేశ కావ్యమే.

కేవలం స్వామివారి చరిత్రను చదివిన చాలదు. స్తోత్ర పారాయణాదులను పఠించినదానికన్న - వారి సందేశమును ఆచరణలో చూపినవారి జన్మ నిజముగ ధన్యము. వారే స్వామికి విశ్వాస పాత్రులు. ఆ భావంతో.... ఇక చదవండి....

## ఆంజనేయ ఆవిర్భావం

ఒకప్పుడు మేరుపర్వత ప్రాంతమును పరిపాలించిన వానర వీరుడు కేసరి. మహా బలశాలీ- పరాక్రమవంతుడూనూ- తనవారికి కొంగు బంగారం- వైరులకో సింహస్వప్నం! మూర్తీభవించిన ధర్మ

మూర్తి. ఇతని ఏలుబడిలోని వారందరూ కలకాలం ఇతనినే తమకు రాజుగా- మహారాజుగా ఉండాలని కోరుకునేవారు.

దేవలోకాన 'పుంజిక స్థల' అను అప్సరస కలదు. సాటిలేని అందం ఆమెది. అందానికే- అందాలు నేర్పే సోకులాడి. చంచల నేత్ర- చపల హృదయ, శాపకారణంగా మనుజ లోకాన జనించి నది అంజనగా. కుంజరునకు దైవదత్తమైన కొమరితయైనది. పద్మ పత్ర విశాలాక్షి. తలిరాకుల సోయగం. మేని అందానికి తోడు- ఆమె వేషధారణ ఆమెకు మరింత శోభను చేకూరుస్తూ- 'బంగారమును కు తావి అబ్బినటుల' ఉండేది

కుంజరుడు- అంజనను, తన మేనల్లుడూ, మహావీరుడైన కేసరికిచ్చి వివాహం చేశాడు. ఈడూ — జోడైన యీ ఆలుమగల సంసార యాత్ర సరాగాల రాగాల సాగింది.

ఎంతకాలానికీ సంతతి కలుగలేదు. చింతాక్రాంతులయ్యారు అంజనా కేసరులు. ఎందరి మన్ననలో పొందిన వీరికి- సంతానం లేని దిగులు- ఎవరితో చెప్పుకోలేనిదీ - ఎవరూ తీర్చలేనిదీయైనది.

ఒకనాడు- సహజసిద్ధమైన పరమ సుకుమార లావణ్యంతో అపురూప సౌందర్యవతిగా వెలుగొందే అంజన- పూవునకు తావిలా- శరీరానికి తగిన వస్త్రాలనూ, దివ్యాభరణాలనూ ధరించి- తనను, చూచువారి కనులు చెదరునట్లుగా- వసంతయామిని వోలె పర్వత శిఖరాన నిలబడి చల్లగ వీచే పిల్లవాయువుల లాలనలో- ప్రకృతిలోని అందచందాలను పరికించు సమయాన మదిలో 'వీరమాతనైన బాగుండెడిది గదా!!" అన్న భావన వచ్చినది.

ఇంతలో- వీచిన గాలి తాకిడికి చీరకొంగు తొలగినది. వక్షస్థలమూ- శరీర భాగాలూ కనిపించసాగినై, యతికైనా- మతిపోయే ఆ అందం వాయుదేవుని డెందాన్ని హరించింది, మోహం జనించింది. నిగ్రహం కోల్పోయిన వాయుదేవుడు అంజనను గట్టిగా కౌగిలించుకున్నాడు.

తనను కౌగిలించుకున్నది దేహమే లేని వాయువు కావడం వలన అంజన ఏమి జరుగుతున్నదో గమనించలేక పోయినది. ఐతే తనకేదో జరుగుతున్నదని మాత్రం కొంత వడికి గ్రహించుకున్నది. భయకంపితురాలైనది. పెద్దగ అరచినది. 'నా శీలమును అపహరింప చూస్తున్నదెవరు ?' అంటూ శపించ సిద్ధపడింది.

పరిస్థితిని గ్రహించిన వాయుదేవుడు ప్రత్యక్షమై "అంజనా? 'మాభీః' భయపడవలసినది లేదు. నీ శీలమునకేమి తక్కువలేదు. నేను పవనుడను. నా ఆలింగనము వలన గొప్ప ధైర్యవంతుడూ, నీతికోవిదుడూ, మహా పరాక్రమవంతుడూ, తేజస్వంతుడూ, మహాబలుడూ, ఎగురుటలోనూ- దుముకుటలోనూ- నాతో సమానుడైన ఒకకుమారుడు నీకుజన్మించగలడు" అనిచెప్పి అదృశ్యుడయ్యెను.

కలనైనా ఊహించని యీ హఠాత్సంఘటన అంజనను ఆనందవార్ధిలో ముంచెత్తినది. పుత్ర జననోత్సాహ వార్తను భర్త కెరిగించినది. కేసరియు, అవధిలేని ఆనందంతో పొంగిపోయినాడు. అంజన గర్భవతియైనది. అచటి పర్వత ప్రాంతాలలో విహరిస్తూ నవమాసాలు నిండగనే- వైశాఖ బహుళ దశమి పూర్వాభాద్రా నక్షత్ర వైధృతియోగ మధ్యాహ్నవేళ ఒక కుమారుని కన్నది. అతడే ఆంజనేయుడు. అంజనాగర్భ సంభూతుడగుట వలన యీ పేరు వచ్చినది.

## ఇది బలశాలికి నైజము కధ

కానక కన్న సంతానమగుట అంజనా కేసరులు ఆంజనేయుని కడు గారాబముగ సాకుచుండిరి. కుమారుని బాల్యక్రీడలు కని ఆ తల్లిదండ్రులు అవధి లేని ఆనంద తరంగాల తేలియాడుచుండిరి. ఒకనాడు ఆంజనేయుడు ఆకలిగొని ప్రాగ్దిశన అపుడే ఉదయించు బాలభానుని గాంచి పండిన పండుగా భ్రమించి దానిని పట్టుకొనుటకై ఒక్క ఉదుటున ఎగిరి వాయువేగ మనోవేగాల అంబరవీధిన సాగిపోవుచుండెను.

సూర్యుని చేరబోవు కుమారుని చూచి వాయుదేవుడు గమనాయాసము కలుగనీయక చల్లగ వీచుచు వెన్నంటి సాగెను తననే చేరవచ్చు తన మిత్రకుమారునకు తన కిరణాల వేడి తగలనీయరాదను భావనతో కాబోలు సూర్యుడును చల్లగనే తోచెను.

ఆనాడు సూర్య గ్రహణం. సూర్యగ్రసనమునకై రాహువు వచ్చెను. అంజనా నందనుడు రాహువునే కబళింపబోయెను. రాహువు వెఱగంది భీతచిత్తుడై సరగున శచీనాథుని చేరి తన దీన గాథను విన్నవించెను. ఇంద్రుడు సంభ్రమాశ్చర్యాలతో సింహికా తనయుని వెంటగొని ఐరావతారూఢుడై వచ్చి హనుమంతునితో ఇది తగదని పలికెను. ఇరువురకు పోరు సాగింది. ఆత్మరక్షణార్థం ఇంద్రుడు వజ్రాయుధమును సామీరిపై ప్రయోగించెను. అది బాలుని ఎడమ హనువును తాకించి. ఆ దెబ్బకు మూర్ఛితుడై పర్వత శిఖరాన పడిపోయినాడు.

మూర్ఛిల్లిన కుమారునిగాంచి వాయుదేవుడు దుఃఖితుడైనాడు. తనయుని తీసుకుని కొండగుహచేరి ఉపచరించుచు వాయుస్తంభన

చేసినాడు. సకల చరాచర జంతుచయము ఊపిరాడక తల్లడిల్లింది ఆ సన్నివేశాన్ని ఉత్తర రామాయణం ఇలా వర్ణించింది.

యాజకుల్ వహ్ని హవ్యములు వ్రేల్వగ జాచు
హస్తముల్ సాచినయటుల నుండె
దివిజులు ప్రేరేప దివికెగిరిన దేవయానంబు
తెగిరిన యటుల నుండె
మునులు నదీతోయముల దోగమునుంచిన
యంగముల్ ముంచిన యటుల నుండె
బశు మృగ నరముఖ ప్రాణు లుర్వినిబెట్టు
నడుగులు బెట్టిన యటుల నుండె

భానుమండల మొక్కచో బాదుకొనియె
గాలగతిదప్పె సత్క్రియల్ గడచె వేద
పాఠముడివోయె బాహ్యమభ్యంతరంబు
గాడ్పు బంధించి చనిన యక్కాలమందు.

ఇలా లోకాలన్నీ వాయు సంచారం లేక అల్లాడిపోసాగినవి. ఇంద్రాది దేవతలు బ్రహ్మను ఆశ్రయించారు. ఆ బ్రహ్మదేవుడును ఇంద్రుని తొందరపాటుకు మందలించి అందరిని తీసుకుని వాయువున్న పర్వత గుహ చేరి చేష్టలుడిగిన బాలుని స్పృశించి చైతన్యవంతుని చేసినాడు. దేవతలందరితో "యీ బాలుడు సామాన్యుడు కాడు. దేవకార్య సిద్ధ్యర్థం జన్మించిన మహానుభావుడు. మీ మీ శక్తుల నీతనికి ప్రసాదించండి" అని పలికినాడు చతురాననుడు.

అంటూనే ముందుగా తానే "ఏ అస్త్రము వలనా మరణం లేని" వరం ఆంజనేయునకు ఇచ్చినాడు.

ఇంద్రుడు పశ్చాత్తప్తుడై స్వేచ్ఛా మరణాన్ని వరంగా ప్రసాదించగా సూర్యుడు సకల శాస్త్ర విశారదునిగా చేస్తానన్నాడు. ఇలా దేవతలందరూ తమ తమ శక్తులను వరంగా అనుగ్రహించారు. సంతసించిన వాయుదేవుడు బంధించిన శీతల వాయువులతో ప్రాణి లోకంను ప్రాణవంతం చేశాడు, విరిగిన హనువు కలవాడగుట వలన ఆంజనేయుని నాటినుండి హనుమంతుడన్నారు.

ఇదొక మహత్కార్యం. గొప్ప సాహసం. ఆంజనేయుడు బాలుడుగ నున్నపుడే తన ధైర్య, బల సాహసాలతో అద్భుత కార్య సాధనకు పూనుకున్నాడు. ఆ కార్యసాధనలో హనువుకు దెబ్బతగిలినా సహించి సత్ఫలితాల నంది, భవిష్యత్కాలంలో బ్రహ్మవు కాగలవన్న వరాన్ని దాశరథి నుండి పొందినాడు. మరెన్నో అద్భుత కార్యాలు సాధించాడు.

విదిళించ నురుగు సింగపుకొదమయు
మదమలినగండ కుంజరములపై
నిది బలశాలికి నైజము కద
తేజోనిధికి వయసుకారణమగునే.

తన శక్తి సామర్థ్యాలను ప్రకటించడానికి వయసుతో పని లేదు. అది సహజ స్వభావ సిద్ధం. దీనిని ఆదర్శంగా తీసుకుని తల్లిదండ్రులు తమ సంతానానికి ఉన్నత కార్యాలను సాధించు నేర్పు, ఉన్నత భావాలను గూర్చి తెలపాలేగాని అల్ప విషయాల పైకి మనసును పోనీయరాదు. ఇదే ఆంజనేయుని బాల్యం మనకు నేర్పే నీతి—రీతి.

## మొక్కయి వంగనిది మానై వంగునా ?

సకల దేవతా వర ప్రభావం వలన అమిత బల సంపన్నుడైన బాల ఆంజనేయుని అల్లరి ఇంతింతనరానిదీ- సహింపరానిదైనది. ఓర్పుకే ఒక పరీక్షగా నిలిచినై ఆ అల్లరిచేష్టలు. మునులు, మహర్షులు, పరమర్షులు, పిన్నలు, పెద్దలు ఒకరేమిటి? వారు వీరు అననేల ? ఆ ప్రాంత నివాసులందరు అంజనాసూనుని చేతిలో బాధలు పడినవారే. తమ కుమారుని అల్లరి భయంకర రూపు దాల్చుట అంజనా కేసరులకు దిగులు పుట్టించినది. ఏమి చేయాలో పాలుపోక చివరకు తపోధనులను ఆశ్రయించిరి. త్రికాలవేత్తలైన వారు దివ్యదృష్టితో బాలుని గమనించి ఇలా శపించిరి. "ఆంజనేయా! ఏ బల గర్వముతో మమ్ములను హింసించుచున్నావో ఆ శక్తి సామర్థ్యములను మరచెదవు గాక! ఎవరైన నీ బలపౌరుషాలను గుర్తుచేసిననే గాని నీశక్తి నీకు గుర్తురాదు!" తదాది అంజనేయుడు అమాయకుని వోలె ప్రవర్తించ దొడగెను. అది గమనించి తల్లిదండ్రులు బాలునికి విద్యాబుద్ధులు నేర్పింపదలచిరి. ఉపనయన సంస్కారములు గావించి విద్యాభ్యాసమునకై సూర్యునికడ కంపిరి.

ఎంతటివారైనా పిల్లలు కాకుండ పెద్దవారు కారు. మానవుని భావి జీవితానికి బాల్యం (చిన్నతనం) పునాది. ఆ బాల్యాన్ని సరియగు మార్గానికి మళ్ళించిన మున్ముందు అతని జీవితం పూలబాట కాదేని ముళ్ళబాట- సహజంగా చెడును ఆకర్షించే మనసును, ఆవైపునకు బాల్యాన పోనీయరాదు. తల్లిదండ్రులు, గురువులు— గురుతర బాధ్యతతో పిల్లలకు క్రమశిక్షణగల చదువును నేర్పించాలి అలా చేసినవాడు "చెడు కనకు-వినకు-చూడకు" అను సూక్తికి ఉదా

హరణులై భావి భారత సత్పౌరులై సత్పథాన పయనించగలరు. "మొక్కయి వంగనిది మానై వంగునా" అనికదా పెద్దల సుద్ది.

తల్లి ఆనతిపై ఆంజనేయుడు సూర్యభగవానుని చేరి "గురుదేవా! నన్ను శిష్యునిగా స్వీకరింపుము. వేద వేదాంగముల నుపదేశింపుము. జ్ఞానభిక్ష ప్రసాదింపు"మని కోరెను.

సకలశాస్త్ర మర్మజ్ఞుడు, సర్వలోక సాక్షియగు సూర్యదేవుడు "కుమారా! నేనొకచోట నిలకడగ నిలుచువాడనుకాను కదా! నిరంతరం వినువీధిని విహరించేవాడను. ఎలా విద్య నభ్యసించగలవు" అని పల్కెను.

అందుకు ఆంజనేయుడు "ప్రభూ! మీరావిషయంలో ఆలోచించవలసిన పనిలేదు'' అని ఉదయాద్రిపై ఒక పాదమును, అస్తాద్రిపై మరొక పాదము నుంచి సూర్యగమనావరోధి కాకుండగ వెనుకకు నడుస్తూ ఏకాగ్రత కోలుపోక శ్రద్ధగా, ఆసక్తిగా సాంగోపాంగముగా వేదాధ్యయనము చేసి నవ వ్యాకరణములను నేర్చెను సకలశాస్త్ర పారంగతుడయ్యెను. బుద్ధిమతాం వరిష్ఠుడయ్యెను.

కార్యార్థులై అవతరించిన దేవతామూర్తులు కూడా గురూపదిష్టులై సామాన్య మానవునిలా ప్రవర్తించుట గురువుయొక్క ప్రాముఖ్యతను లోకానికి చాటుటకే !

విద్యాభ్యాసానికి ఏకాగ్రత, పట్టుదల, ఆసక్తి, శ్రద్ధ- అవసరాలు. 'విద్యావినయేన శోభతే. కదా! ఆనాటి గురుకుల విద్యాభ్యాసాలు గమనించిన ఎంతటి కఠోరమైనవో గమనించవచ్చు. మరి యీనాటి విద్యార్థులు తమ ముంగిటికే వచ్చి విద్యాబోధన చేయు

2)

చున్నా పాశ్చాత్యేతరాంశాల మీదున్న శ్రద్ధ వారికి విద్యార్జనలో ఏ మాత్రం లేకపోవుట కడు శోచనీయం. అట్టివారికి ఎంతో కఠినమైన అంజనేయుని విద్యాభ్యాసం కర్తవ్యదీక్షను గుర్తు చేస్తుంది.

## ఆంజనేయుడు - సన్మిత్రుడు

వానరరాజైన ఋక్షరజునకు వాలి, సుగ్రీవులు కుమారులు. తండ్రి మరణానంతరం పెద్దవాడైన వాలి రాజు కాగా, సుగ్రీవుడు యువరాజు. ఈ యువరాజుకు స్నేహితుడు ఆంజనేయుడు. వాలి సుగ్రీవునిపై అకారణ వైరము పూని తరిమినపుడు అంజనేయుడు సుగ్రీవుని వెంట కొండ కోనలలో తిరుగాడుచు ఒకనాడు తన చెలికాడైన సుగ్రీవునితో,

"ఓ రాజా! దుందుభి అను రాక్షసుడు అమిత శక్తి శాలి. అతడొకనాడు మహిష వేషధారియై వాలిని యుద్ధము చేయ రమ్మని సవాలు చేసెను. వాలి క్రోధావేశుడై దుందుభి నెదుర్కొనెను. పోరు ఘోరముగ సాగెను. మహావీరుడైన వాలి పిడికిలి పోట్లతో, కాలి తాపులతో, రాళ్ళు విసిరి, చెట్లు పెకలించి కొట్టగా- బలమైన ఆ దెబ్బలకు దుందుభి ప్రాణాలు అనంత వాయువులలో లీనమైనవి. ఆవేశపూరితుడైన వాలి దుందుభి కాయాన్ని రెండు చేతుల పైకెత్తి గిర గిర త్రిప్పి విసరివైచెను. అది పోయి పోయి మతంగ ముని ఆశ్రమాన పడి అందుండి రక్తబిందువులు ఎగిరి ఆమునిపైపడగా పరికించి చూడగా దుందుభి కాయం మతంగునికి కన్పించెను. దూర దృష్టితో తేరిపార చూచిన మతంగ మహాముని పరిస్థితిని గమనించి "ఈ అకృత్యమునకు పాల్పడినదెవరో- అతడు యీ ఆశ్రమం ప్రవేశించిన వాని శిరసు శతధా ఛిన్నము గును" అని శపించెను. కాన "ఓ

రాజా ! ఈ ఋశ్యమూక పర్వతంమీద నిర్భయంగా యథేచ్ఛగా చరించవచ్చు. భయపడవలసినది లేదు" అని మారుతి చెప్పిన మాటలు సుగ్రీవునకు ఎడారిలో ఒయాసిస్సును తలపించినట్లయి నది. అందరూ ఋశ్యమూకాద్రి చేరిరి.

"ఏ జనుడు విపత్తి సౌఖ్య సదృశ క్రియు డాతడుమిత్రుడు" అన్నరీతిగా తోడు-నీడగా సుగ్రీవుని వెన్నంటి నడచాడేగాని బృహ స్పతివంటి బుద్ధిశాలియైన పవన తనయుడు మునుల శాపకార ణంగా తన శక్తిసామర్థ్యాలు మరచిపోవడం జరగకుండినట్లయితే సుగ్రీవుని కష్టాల కడలినుండి ఏనాడో గట్టెక్కించి ఉండేవాడు. నిజమైన మిత్రుడిలా ఉండాలి అని తన నడవడికలో అడుగడు గునా చూపించి సన్మిత్ర మార్గదర్శకుడైనాడు.

"శీలాన్ని గమనించి కలసి మెలసి ఉండండి. మాటకు, నడతకు సంబంధం లేనివాళ్ళతో స్నేహం చేయరాదు'' అని సన్మిత్ర పదాన్ని సార్థకం చేసిచూపాడు మారుతి ఈ సన్నివేశంలో

## భయమున్న - జయలక్ష్మి నిలువదు

ఇలా వాలిచే బహిష్కృతుడైన సుగ్రీవుడు అంజనేయుని ధీశక్తియుక్తులపై పరిపూర్ణమైన విశ్వాసముంచి నిర్భయుడై ఋష్య మూక పర్వతాన మకుటము లేని మహారాజుగా వెలుగొందుచుం డెను. ఐతే పగబట్టిన కోడెత్రాచులాంటి మనస్తత్వం కల వాలి స్వయముగా తాను రాపీలులేని కారణాన అంతరంగికుల నంపి సుగ్రీవుని సంహరింప ప్రయత్నించుచునే యుండెను. కాని వారు సూర్యునిముందు చీకటివలెనె సమీర కుమారుని శక్తి సామర్థ్య ముల ముందు నిలబడలేక పలాయనమంత్రము పఠించుచుండిరి.

ఇటులుండగా ఒకనాడు అమిత తేజోవంతులు, దృఢకాయులు, నారచీరలు ధరించినవారు, ధనుర్బాణపాణులు, ఆజానుబాహులు, మూర్తీభవించిన క్షత్రియత్వముగల వారిరువురు తమవైపునకే వచ్చుటనుచూచిన సుగ్రీవుని గుండియలదరగా- భీరువువోలె పారిపోజూచుచు అంతరంగిక సచివుడైన అంజనేయునితో—

హనుమా! అదిగో! అటు చూడు! ముని వేషధారులయ్యు, ధనుర్బాణములను ధరించి 'ఇదం క్షాత్రం ఇదం బ్రాహ్మం' అన్నటుల కాన్పించుచు ఎవరికోసమో వెతుకుచున్నవారివలె తోచు చూపులతో వచ్చుచున్నారు. వాలి పంపగా నా ప్రాణము లపహరించుటకై వచ్చుచున్నట్లున్నారు. పైకి వేసిన వేషమువలె వీరి అంతరంగము ఉండకపోవచ్చు. బతికున్న బలుసాకు తినవచ్చు. వాలి తాను ప్రవేశించగరాని ప్రదేశము కనుక నిరంతరం తన మిత్రులచే నన్ను వధించ చూచుచున్నాడు. వారిని నమ్మరాదు. ఇటనుండి తప్పుకొనుట శ్రేయోదాయకము.

ఏలనందువా! శత్రు సంచారమును వేయి కనులతో కనిపెట్టి వుండవలెను. ఇటువంటివారు బహు నమ్మకస్తులుగ కన్పించి సమయం కోసం కాచుకుకూర్చుని నమ్మినవారిని కాటువేయుదురు.

అరయశ్చ మనుష్యేణ విజ్ఞేయాశ్ఛద్మచారిణః ।
విశ్వస్తా నామ విశ్వస్తా శ్ఛిద్రేషు ప్రహరన్త్యపి ॥

అన విని పరేంగితజ్ఞుడైన అంజనాసూనుడు— వాలిని తలచుకొని సుగ్రీవుడు భయపడుచున్నాడని గ్రహించి సాంత్వవచనాలతో ఇటుల పలికెను.

వానరేంద్రా! నీకు భయమేలనయ్యా! వాలి యీ పరిసరాల వైపు కన్నెత్తి చూచుటకైన సాహసించడు వారు మన కహితులని నేననుకోను. వారివలన నీకేం భయం లేదు. సహజంగా భయం ఆవరించియున్న మనసుకు అన్నీ అనుమానాలే.

భయము తొంగిచూడ పరువెత్తు మగసిరి
భయము వెంట భూత చయము వచ్చు
భయము నిలుచుచోట జయలక్ష్మి నిలువదు"

అనికదా కవి వాక్కు. భయము ఆలోచనను చంపుతుంది. కాన బుద్ధిశాలివై ఆలోచింపుమనగ శుభంకరమైన ఆ మాటలకు సంత సించి సుగ్రీవుడు వాని యథార్థ వృత్తాంతమును కనుగొని రమ్మని హరీశుని పంపెను.

## మాట - మన్నన

తన స్వామి ఆదేశానుసారం సామీరి వారెవరో తెలుసుకొను టకై కపి రూపమును వీడి బ్రహ్మచారిగ రామ, లక్ష్మణులను సమీపించి—

ఆర్యులారా! మీరెవరు? ఏపనికై ఇటకేతెంచినారు? అనితర సాధ్యమైన మీ రూప బల సంపదలు చూస్తే ఉత్తమ క్షత్రియ సంజాతులవలె కన్పట్టుచున్నారు. వేషమందు మా- బ్రహ్మతేజ ముట్టిపడు తాపసోత్తముల సైతము మరపించుచున్నది. వృషభ గమనంతో, ఇంద్రచాపమును బోలు ధనుస్సులను ధరించి సూర్య చంద్రులవలె వెలుగొందు మిమ్ము చూచి ప్రకృతి సౌందర్యంతో పులకించే అడవి జంతువులు భయంతో పరుగులు తీస్తున్నాయి. బంగరు కాంతులనీను ఖడ్గాలు బుసకొట్టు కోడెత్రాచులాగున్నాయి.

ఇంతకీ మీరెవరు? అని సరస సంభాషణా చతురుడు- స సందర్భ వాగ్బాణ నిపుణుడు- వాక్య కోవిదుడు అంజనాసూనుడు వారిని పలుకరించి ప్రశ్నించెను.

హనుమ ఎంతగా పలుకరించినా ఆ అన్నదమ్ములు పెదవి విప్పనే లేదు. వారిని అంతగా తన్మయులను చేసింది హనుమ ధ్వాణి. వారి ఉపేక్షా భావము నుపేక్షింపక మరల తిరిగి అయ్యలారా! నేనింతదనుక మాటలాడినా మీరు స్పందించరదేమి? ఔను నిజమే. నేనెవరినో ముందుగా మీకు చెప్పనేలేదు కదా!

సుగ్రీవుడు వానర రాజు. ధర్మాత్ముడు. మహా వీరుడు. అన్నచే పరాభవింపబడి అడవుల పాలైనాడు. అతడు పంపగా మీ దగ్గరకు వచ్చాను. మీ స్నేహాన్ని కోరుచున్నాడు. అతని ఆంతరంగిక సచివులలో నేనొకడను. నన్ను హనుమంతుడని పిలుస్తారు. వాయు పుత్రుడను. కామరూప, కామగమన శక్తులు కలవాడను అని మనోహరంగా పలికినాడు.

ఇచట మాటకున్న శక్తి ఎట్టిదో- దానిని ఎలా వశం చేసుకోవాలో హనుమంతుడు తన సంభాషణద్వారా తెలియపరచినాడు. ఇసుమంతైనా పరిచయం లేనివారితో మాట్లాడునపుడు ముందుగా తనను తాను పరిచయం చేసుకోవాలి. అందులో ఆత్మస్తుతి పనికిరాదు. వినయంతో కూడిన ఆత్మార్పణ కలిగి ఉండాలి. అదే మాటకారిత్వం. హనుమంతుని మాటలకు రామ లక్ష్మణులు ఎలా మంత్రముగ్ధులైనారో అలాంటి మాట నేర్పు కలిగి ఉండాలి.

మాటలచేత దేవతలు మన్ననజేసి వరంబు లిత్తుర
మ్మాటలచేత భూపతులు మన్నన జేసి ధనంబు లిత్తుర
మ్మాటలచేత కాముకులు మన్నన జేసి సుఖంబు లిత్తుర

మ్మాటల నేర్పెఱున్న నవమానము మానము మానభంగమున్.
అంటాడు ఓ కవి. మధుర భాషణము మానవుని మాననీయునిగ చేస్తుంది. చక్కని మాటకారిని అన్నిచోట్ల, అన్ని వేళలా అందరూ ఆదరిస్తారు. ఏనాడూ ఎవరిని ఏసన్నివేశంలోనూ మెచ్చుకోని వాక్యజ్ఞుడూ, వాక్య కుశలుడూయైన రాముడు మొదటి చూపులోనే ఎంతగానో మెచ్చుకున్నాడూ అంటే అంజనేయుని వాక్నైపుణ్యం ఇంతింతనరానిది. ఆ బుద్ధి కుశలతను వాల్మీకి వాక్యకోవిద అంటాడు. అంటే ఎవరితో ఎంతవరకు ఎలా మాట్లాడాలో తెలిసినవాడన్నమాట ఇదొక సమ్మోహనాస్త్రం. ఆ బుద్ధికుశలత మూడు విధాలుగా ఉంటుందని చెప్తారు. అవి సదా జ్ఞప్తి యందుంచుకొనుట అవసరం.

స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామి గోచరా ।
బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్య గోచరా ॥

గతాన్ని గమనిస్తూ వర్తమానాన్ని పరికిస్తూ భావిని ఊహిస్తూ పొందికగా మాటలాడాలన్నమాట.

## హనుమంతుని - ధీ వైభవం

సుగ్రీవ సచివుడైన అంజనేయుని మాటలకు ఆనందపరవశుడైన శ్రీరాముడు లక్ష్మణునితో-

చూచావా! లక్ష్మణా! అంజనేయుని వాక్చాతుర్యం

సచివోయం కపీంద్రస్య సుగ్రీవస్య మహాత్మనః
తమేవ కాంక్షమాణస్య మమాంతిక ముపాగతః.

అభిభాష స్వసౌమిత్రే సుగ్రీవ సచివం కపిం
వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః స్నేహయుక్తమరిందమ.

నా నృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితం.

ఋగ్వేదం-స్వర ప్రధానమైనది. ఉదాత్త అనుదాత్త స్వరిత ప్లుతాలతో గురుముఖతః అధ్యయనం చేసినగాని అది పట్టుపడదు. దీనికి చిత్త చాంచల్యం పనికిరాదు. మనో నిశ్చలత అవసరం. ఆ విధంగా అధ్యయనం చేసినవాడు వినీతుడు.

యజుర్వేదానికి- ధారణ ప్రధానం. ఎందుకంటే ఒకేవిధమైన పద జాలాలు మరల మరల తిరిగి తిరిగి రావటం జరుగుతుంది. ధారణ లోపించిన జాయతే వర్ణ సంకరః. కాబట్టి ధారణాశక్తి కల వాడె యజుర్వేదాధ్యాయి.

సామము- గాన ప్రధానమైనది. గాన రాగ తాళ లయ స్వర జ్ఞానములు అత్యంత ఆవశ్యకాలు. ఇది నవనవోన్మేషశాలిని ప్రతిభ అదే వైదుష్యం వైదుష్యం కలవాడే విదుషి కాగలడు.

అంటే యీ మారుతి ఏవం విధమైన మూడు వేదాలను అధ్యయనం చేసినవాడన్నమాట. ఋగ్వేద వినీతుడు. యజుర్వేద ధారి. సామ వేద విదుడు. వేదవేదాంగ పారంగతుడు.

నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం
బహు వ్యాహరతానేన న కించిదప శబ్దితం.
స ముఖే నేత్ర యోర్వాపి లలాటే చ భ్రువోస్తథా
అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదతః క్వచిత్.

అంతేకాదు లక్ష్మణా! ఇంత సేపు మాటలాడిన మాటలలో ఒక్క అప శబ్దము కూడ దొర్లలేదు. వ్యాకరణం నేర్చినవానికి మాత్రమే అది సాధ్యం.

ముఖము కనులు, కనుబొమలు, లలాటము మొదలైన అవయవాలలో ఏవిధమైన వికారమూ కానరాదు. అంటే శాస్త్రం విధించిన పాఠకాధములు అర్గురు. వారు-ఊనిరాగాలు తీసేవాడు, సంగీతంలో చెప్పేవాడూ, తల ఆడిస్తూ చెప్పేవాడూ, రాసినదానిని చూస్తూ చదివేవాడూ, శబ్ద జ్ఞానం - అర్థజ్ఞానం లేనివాడూ, కీచుగొంతువాడు- ఆంజనేయునిలో యీ విధమైన వికార భావాలు మచ్చుకైనా లేవు

అవిస్తర మసందిగ్ధం అవిలంబిత మద్రుతం
ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే.
సంస్కారక్రమ సంపన్నామద్రుతా మవలంబితాం
ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయ హారిణీం.
అనయా చిత్రయా వాచా త్రిస్థాన వ్యంజనస్థయా
కస్య ఆరాధ్యతే చిత్తముద్యతా సేర రేరసి.

నంగి నంగిగా మాట్లాడటం-సందర్భానికి అతకనివి ఏవోవో మాట్లాడటం-విషయం అర్థాంతరంగా ఆగిపోవటం-లేదు. మాటల ఒరవడి ఒక ప్రవాహంలా దొర్లుతున్నది. హృదయ,కంఠ, మూర్ధాల నుండి మధ్యమ స్వరంతో వచ్చే మాటలు సంస్కార సంపన్నమై క్రమ పద్ధతిలో కళ్యాణగుణయుతములై వినువారి డెందాలను హత్తుకొని అలరిస్తున్నవి. సర్వశాస్త్ర విశారదుడు మాత్రమే ఇలా మాటలాడగలడు. చిత్ర, విచిత్రమై రమణీయంగాసాగే యీ వచోధారకు ఎవడు వివశుడు కాడు. కత్తిదూసి మీదికి వచ్చు విరోధి సైతము ప్రమాన్పడి శిరము వంచి నమస్కరింపకుండునా!

ఇదీ హనుమంతుని అద్భుత వచో వైభవం. మాటకారి మన్నన పొందని ప్రదేశమే లేదు.

ఈ సన్నివేశాన్ని పదే పదే మననము చేస్తూ సాలోచనగ ఆలోచించగలిగినవాడు చక్కని వాక్ నైపుణ్యం కలవాడగును. అతడు పుష్పగుచ్ఛమువలె సకల మానవాళి శిరము నధివసించ గలడు. ఇది నిజం. మృదుమధురంగా మాట్లాడేవారికి శత్రువు లెవరుంటారు ?

అంజనేయుని వచోవైభవం ఒక యెత్తు దేశ కాల పాత్రతల నెరిగి సమయోచితంగా కార్యసాధన చేయగల చతురత మరో ఎత్తు. స్వార్థమెరుగని స్వామిభక్తి పరాయణుడు. స్వామి కార్యమే గాని స్వకార్యమున కెచటా చోటిచ్చినట్లు చూడబోము అతని చరిత్రలో ఏ సందర్భంలో ఏ పదాన్ని వాడాలి ? ఆ పదానికున్న శక్తి ఎంత ? వ్యంగ్య వైభవం ఎంత ? ఎదుటి వ్యక్తిని అంచనా వేయుటంలో గల ఊహాశక్తి వీటన్నిటిని గురించి-

అంటే కార్యసాధకున కుండవలసిన లక్షణాలను గురించి రాజనీతి ఇలా చెప్తుంది.

అనురక్తశ్శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్
వపుష్మాన్ వీతిభీర్వాగ్మీ దూతో రాజ్ఞఃప్రశస్యతే.

అనురక్తుడు, కల్లాకపటం లేనివాడు, స్మృతిమంతుడు, దేశ కాల విదుడు, రూపసి, నిర్భయుడు, చక్కని మాటకారిగనున్న కార్యసాధకుని దూతగపొందిన రాజు సాధించరానికార్యముండునా!

## వసుధైక కుటుంబకం

తనకు మొదటి చూపులోనే రామలక్ష్మణుల యెడ పూజ్య భావం కలిగింది. ఆభావంలోకూడ సుగ్రీవునికి వీరితో స్నేహమేర్ప డిన కష్టములనుండి బయటపడునుగదా! అను భావనే. అలాగే రామునికిగూడ "ఇట్టివాని సాహచర్యము గల రాజు నిజముగ

అదృష్టవంతుడు" అని అనిపించినది ప్రశంసార్హమైన కార్య సాధన కిది మొదటి మెట్టయినది. సుగ్రీవుడు వారి వృత్తాంతము నరసి రమ్మన్నాడేగాని మరేమీ చెప్పలేదు. ఐనా రామ, సుగ్రీవుల మైత్రి ఇరువురకు శుభంకరమని, కళ్యాణయుతమని గ్రహించి- "సుగ్రీవుడు మీతో చెలిమి చేయనున్నాడని, అతడు ధర్మాత్ముడు, విశ్వాసపాత్రుడు అని చెరవతీసుకు చెప్పుటలోనే హనుమంతుని దేశకాల విదిత్వమున్నది.

సోదరుని అనుజ్ఞతో తమను తాము పరిచయం చేసుకుంటూ లక్ష్మణుడు "సచివోత్తమా! ఏది కావాలని కోరుకుంటున్నామో అనుకోకుండగ 'ఆడబోయిన తీర్థమెదురైనట్లు' మాకది లభించినది. ప్రహృష్టాంతరంగుల మయ్యాము. అయోధ్యా నగరాధిపతి దశరథ మహారాజు. ఆ రాజుకు పెద్ద కుమారుడూ, నాకగ్రజుడు యీ రాముడు. నన్ను లక్ష్మణుడంటారు. అరణ్యవాసానికి మా అన్న గారూ, వారివెంట మా వదిన జానకీ నేనూ అనుసరించి వచ్చాం. మేమిరువురము లేని సమయాన ఒక రాక్షసుడు మా వదినగారి నపహరించాడు. ఆమెను వెతుకుచూ తిరుగుచుండగా కబంధుడు కన్పించి సుగ్రీవుని గురించి చెప్పి సుగ్రీవుని కలుసుకోవలసినదిగా సూచించాడు.

"అహం చైవహి రామశ్చ సుగ్రీవం శరణం గతౌ"

నేను, రాముడును సుగ్రీవ మైత్రి కోరుకుంటున్నాం. మమ్ముల నాతని సన్నిధానానికి చేర్చవలసినదిగా కోరాడు.

లక్ష్మణుని మాటలు వినినంతనే అంజనేయుని హృదయాన మెరుపు మెరిసినట్లు ఒక ఆలోచన తళుక్కున మెరిసింది.

అదే ధీ వైభవం అంటే. సమయానికి స్ఫురించని బుద్ధి విశేషం చచ్చుబడిన చేయివంటిది.

ఈదృశా బుద్ధి సంపన్నా జితక్రోధ జితేంద్రియా
ద్రష్టవ్యా వానరేంద్రేణ దిష్ట్యా దర్శనమాగతాః.

ఇటువంటి బుద్ధి సంపన్నులు, జితక్రోధులు, జితేంద్రియులు నైనవారిని సుగ్రీవుడు స్వయముగా వచ్చి దర్శించుకోవలసివుండగా-వారే వచ్చి సుగ్రీవుని చూడవచ్చుట సుగ్రీవునిదెంత అదృష్టమో కదా!

వాలి, సుగ్రీవులు అన్నదమ్ములు. వాలి సుగ్రీవునియెడ అకారణ వైరమూని రాజ్యభ్రష్టుని చేయుటయే కాక భార్య రుమను కూడ చేపట్టినాడు. దిక్కుదోచని స్థితిలో సుగ్రీవుడు కానల వెంబడి తిరుగుచున్నాడు. వాలి వధించునను భయంతో మీరంగీకరించిన మా ప్రభు సన్నిధికి తీసుకుపోతాను అని వారిని సుగ్రీవుని దగ్గరకు తీసుకువచ్చి-రాముని సుగ్రీవునకు పరిచయం చేసిన విధానం నీతిమంతమూ, ఆలోచనాయుతమూ, ఆదర్శవంతమూ-ఐనట్టిది.

ఈనాడు ఒక రాష్ట్రం మరో రాష్ట్రం, ఒక దేశం మరో దేశం అకారణ అసూయా రాగ ద్వేషాలతో, కక్షలూ కార్పణ్యాలతో కుహనా రాజకీయాలతో సమాజ అభ్యున్నతి, దేశప్రగతి కుంటుపడే ప్రమాదం క్షణక్షణం పొంచివుంది. ఇటువంటి పరిస్థితులలో ఆలోచనాపరులు, రాయబారులు, సంధానకర్తలు-మొదలగు వారి పక్షర్తలకు రామాయణ సన్నివేశాలలో హనుమంతుడు నెరపిన రాజనీతి, కార్యసాధన కౌశలం ప్రయోగించిన మేధాశక్తి, సమయ సందర్భములనెరిగి తనంత తాను తీసుకున్న నిర్ణయాలు-ఏ కాలమునాడు జరిగినవో - అయినా-నేటికీ అనుసరించదగినవి. విభిన్న

ప్రవృత్తులుగల నర, వానరులకే అంతటి సఖ్యత నొనగూర్చిన అంజనేయుని దీర్ఘదర్శిత్వం అందరూ అవశ్యం ఆచరింపతగినవి. 'వసుధైక కుటుంబకం' అను సూక్తికి నిదర్శనమైనవి. చూడండి.

సుగ్రీవ మహారాజా! ఈ రాముడు మహాప్రాజ్ఞుడు, దృఢ విక్రముడు. సత్యవిక్రముడూనూ. వీరి జనకుడు ఇక్ష్వాకు వంశాన జనించిన దశరథ మహారాజు. గొప్ప తపస్వి సత్యసంధుడు ఆడి తప్పినదిలేదు. తండ్రి యానతి తలదాలిచి అడవులకు వచ్చిన యీ రాముడు ధర్మమూర్తి ఇల్లాలితో, సోదరుడైన యీ లక్ష్మణు నితో కలసి వచ్చాడు. భార్యను ఎవరో అపహరించారు. భార్యా వియోగంతో రాముని అంతరంగం శోకతప్తమయింది. నీ సాయం కోరి వచ్చిన వీరిని ఆదరించు. వీరి సఖ్యం నీకు అవశ్యం. ఈ తేజ శ్శాలుర సన్నిహితం నీకు కొండంత అండ. అని చక్కని పద బంధాలతో ముందు ముందు నీవు సుఖజీవనం చేయుటానికి వీరి అవసరం ఎంతో ఉందిసుమా అని నర్మగర్భంగా చెప్పగా సుగ్రీ వునికి వేయి ఏనుగుల బలం వచ్చినట్లయినది, గుండె బెదరు అడగినది. ఈవిధముగా రామ సుగ్రీవులకు పవిత్ర మైత్రీ బంధం కలిగించిన తీరు లోకోత్తరమైనది. భావితరాలవారికి ఒక కొత్త బాట నేర్పరచినట్లయినది.

## ఒక చల్లని మాట - ఓదార్పు

అనుకున్న ప్రకారము వాలి వధ జరిగినది. ఈ వృత్తాంత మును సరగున పరుగిడి వానరులు తారకు తెల్పిరి. మూర్తీభ వించిన శోక దేవతాలావచ్చి తార భర్త శరీరమునుచూచి అతి దీనముగ విలపింపసాగినది ఆప్రాంతమంతా ఎటుచూసినా విషా దమే. ఎవరికీతారను ఓదార్పుశక్తి-ఆమెదగ్గరకు వెళ్ళగల ధైర్యము



లేకపోయినది అంతలో సమయోచిత సంభాషణా చతురుడగు ఆంజనేయుడు తారనుచేరి-శ్రవణ సుభగములైన మాటలతో ఇటుల ననునయించినాడు.

గుణదోష కృతం జంతుః స్వకర్మ ఫలహేతుకం
అవ్యగ్ర స్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభా శుభం.
శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనానుకంప సే
కస్య కోవా శోచ్యోస్తి దేహేస్మిన్ బుద్బుదోపమే.
జాతస్య నియతామేవం భూతానామాగతిం గతిం
తస్మాచ్ఛుభం హి కర్తవ్యం పండితే నేహ లౌకికం.
అంగదస్తు కుమారోయం ద్రష్టవ్యో జీవపుత్రయా
ఆయత్యాం చ విధేయాని సమర్థాన్యస్య చింతయ.

దేహి తాను చేసిన మంచి, చెడు పనుల ననుసరించి వానికి తగిన ఫలితముల ననుభవించును. జీవితం క్షణ భంగురం. నీటి బుడగ. పుట్టిన ప్రతి ప్రాణి గిట్టక మానదు. అనివార్యమైన యీ జనన మరణాలను గురించి-నీవంటి విజ్ఞత గలవారు ఇలా ఏడ్వ వచ్చునా! గతాన్ని మరచి కర్తవ్యాన్ని ఆలోచించు. ఉన్న కుమారుని అంగదుని చూచైనా దుఃఖాన్ని దిగమ్రింగు' ఈ ఓదార్పు వలన తార ఊరడిల్లినది.

తారా విలాపాన్ని అచటివారెవరూ ఆపలేకపోయారు. సరి కదా దరిజేరి ఓదార్చ ప్రయత్నమూ చేయలేకపోయారు. ఒక చల్లని మాటతో ఆమె దుఃఖాన్ని మరపింప ప్రయత్నించలేదు. కన్నీరు మున్నీరుగా విలపించే తారను తన చల్లని మాటతో-అంటే ఉపశమనం కలిగించే మాటలతో ఓదార్చాడు. ఆఓదార్పు ఆమెను కర్తవ్యోన్ముఖురాలిని చేసింది. అందుకే అంటారు-

**రజనీ కరః ఖలు శీతో రజని కరాచ్చందనో మహాశీతః**
**రజనీ కరచందనాభ్యాం సజ్జన వచనాని శీతాని.**

చంద్రుడు శీతల కిరణాలతో చల్లదనం కలిగిస్తే-చందనం అంతకన్న చల్లదనం కలిగిస్తుందట. ఆ చంద్ర, చందనాలకన్న సమయమునకు తగినట్లున్న మాటకారి చల్లని మాట ఎంతటి ఆవేదననైనా-ఆవేశాన్నయినా ఇష్టమాయం చేస్తుందట. అంటే ఒక్క మాట సన్నివేశాన్నిబట్టి ప్రయోగించేవాని వాక్చాతుర్యాన్ని బట్టి ఎన్నో రూపాల ఎదుటివానిని ఆకట్టు కుంటుందన్నమాట. ఇట్టి మాట నేర్పుండాలని, ఇంతటి బరువైన సన్నివేశంలోకూడ హృదయానికి తగిలిన ఎంతటి గుండె గాయాన్నయినా మాన్పి గుండె నిబ్బరం కలిగించగలదని లోకానికి చాటాడు హనుమ. స్వయముగ రాముడు వాలికి అంత్య సంస్కారాలు జరిపించి సుగ్రీవుని పట్టాభిషిక్తునిగా-అంగదుని యువరాజుగా చేశాడు.

## కర్తవ్య బోధ

రామ లక్ష్మణులు ప్రస్రవణ గిరిపై వర్షాకాలము గడిపినారు. శరదృతు వారంభమయినది. కిష్కింధలో సుగ్రీవుడు భోగలాలసుడై తారా, రుమలతో కాలం గడుపుతూ రాజ్యభారం మంత్రులపై నిడి మధిరాపానమత్తుడై వర్షఋతువుదాటిశరదృతు వేతెంచినా-తన యీ మహోన్నత స్థితికి మూలమైన రామునికి అనాడిచ్చిన తన మాట చెల్లింపునకు ప్రయత్నించు చాయలేవీ కన్పడలేదు.

"ఆకాశం మల్లెపూలవలె తెల్లగనున్నది. నదులలో నీరునిర్మలంగా ఉంది. నెమళ్ళు నాట్యమాడ మానినవి. మార్గాలు ప్రయాణ యోగ్యాలుగా ఉన్నాయి సుగ్రీవుడు కర్తవ్యాన్ని మరచినట్లున్నాడు"

అనుకుని మారుతి సుగ్రీవుని చేసి సత్యము, మనోహరము, హితము, శ్రవణ సుభగాలైన మాటలతో కర్తవ్యోన్ముఖుని చేయుచు—

రాజ్యం ప్రాప్తం యశశ్చైవ కాలే శ్రీరభివర్ధితా
మిత్రాణాం సంగ్రహశ్శేషః తద్భవాన్ కర్తుమర్హతి.

ఓ రాజా! రాజ్యం లభించింది. సత్కీర్తి నందుకున్నావు. కాలానుగుణంగా సంపదా పెరిగింది. వైభవాలకన్నిటికి మూల కారణమైనది. మిత్రకార్యం మాత్రం మిగిలేవుంది. అనాడు ఋష్య మూకాద్రి పైన పవిత్రమైన మిత్రబంధం ఏర్పడినపుడు అగ్ని సాక్షిగా చేసుకున్న ప్రమాణాలు. అందు రాముడు తన మాట నిలబెట్టుకున్నాడు. ఆ ఉపకారానికి ప్రత్యుపకారంగా అనాడు నీవు వర్షాకాలం పూర్తికాగానే సీతాన్వేషణ సాగిస్తానన్నది మాత్రం మాటగానే మిగిలిపోయింది. ఆ మాట మరచావో? విషయలాలసు డవై ఉపేక్షించావో!

సన్మార్గగాములెపుడూ స్వసుఖాన్ని తృణీకరించి మిత్ర కార్యం నెరవేరుదాకా విశ్రమించరు. కృతఘ్నుని సిరిసంపదలు వీడిపోవును. రాముడు మనకు మిత్రుడు. కాలవేత్త. బుద్ధిమంతుడు ఇప్పటికే కాలాతీతమైనది.

తానుగా వచ్చి మాత్రం కర్తవ్యాన్ని గుర్తుచేశాడు. సమయా నికి తగినరీతిగా ప్రవర్తించనివాడు మిత్రుడే కాదు. నీకోసం వాలి ప్రాణాలు తీయటానికైనా వెనుకాడలేదుకదా రాముడు! మరి నీకీ జాగేల కనుసైగ చేస్తే నీముందు వేనవేల వానర, భల్లూక వీరులు వచ్చి వాలుదురే? సమయం దాటినతరువాత చేసిన కార్యం ఎంత మహత్తరమైనదైనా మిత్రున కుపకరించునా? కాన ఓరాజా! వెంటనే వానర, భల్లూకవీరులను సీతాన్వేషణకై తరలి రావలసినదిగా అజ్ఞా పించు. రాముడే అలిగిననాడు సముద్రము లంకతుండునా! యుక్

గంధర్వ, దేవ, దానవుల గుండియ లదరి అదరి అగతుండునా' అని కాలానుగుణంగా చేసిన ప్రబోధానికి ఒకింత భయం, ఒకింత ఆంజనేయునిపై అభిమానం పెరగగా సుగ్రీవుడు కపిసేనను ఎట నున్నా పదిహేను రోజులలో చేరుకోవాలనీ, లేనినాడు శిరచ్ఛేదమే శిక్ష అని ఆజ్ఞాపించాడు.

## మఱియు కళా కృషి బీజము

ప్రస్రవణ గిరిమీద క్షణమొక యుగముగా గడుపుతున్న రామునకు వర్షాకాలం వెళ్ళి శరత్కాలం వచ్చి ప్రకృతి- యుద్ధా నికి తగినవిధంగా మారినా పూర్వం కుదుర్చుకున్న స్నేహ ఒప్పం దం ప్రకారం ఇంకను సుగ్రీవుడు రాడాయె ఓర్పు రామునిలో నశించింది. తమ్ముడు లక్ష్మణునితో- "లక్ష్మణా! సుగ్రీవుడు విషయలోలుడై గతాన్ని మరచినట్లున్నాడు. ఒకసారి నీవు కిష్కిం ధకు వెళ్ళి సుగ్రీవుని హెచ్చరించు. సుగ్రీవా! ఇప్పటివరకు రాముని అనుగ్రహాన్నే చూచావు. ఇక ఇపుడు ఆగ్రహాన్ని చూడ బోతున్నావు? వాలి వెళ్ళినదారిన పయనించాలనుకొను?".

సహజ శాంతస్వభావుడైన లక్ష్మణుడు అన్నగారి మాటలకు తనువు కంపింపగా ధనుర్బాణపాణియై పిడుగుల గర్జనను బోలిన అడుగులతో కిష్కింధలో కాలిడెను. ప్రళయకాల రుద్రునిలా నున్న రామానుజుని చూచి కపులు గడగడలాడిరి ఇటువంటి పరిస్థితిని ముందుగనే గమనించి జాగ్రత్తపడిన నీతివేత్త హనుమ లక్ష్మణుని సమీపించి—

త్వత్తోధికతరో రామో భక్తోయం వానరాధిపః
రామకార్యార్థమనిశం జాగర్తి న తు విస్మృతః.

మహారాజా! ఈ వానరరాజు రామునకు మీకంటెను గొప్ప భక్తుడు. రేబవలు రామకార్యార్థమైన ఆలోచనే. తన కర్తవ్యమును విస్మరించలేదు. ఇదిగో! ఇటు చూడు నేల యీనినటుల కనిపించే యీ వానర వీరులు సీతామాతను వెతుకుటకై వచ్చినవారు. త్వరలో సీతాన్వేషనార్థమై నేల నాలుగు చెరగులకు వెళ్ళుటకై సిద్ధముగ నున్నారు. సుగ్రీవుడు మిత్రకార్య నిర్వహణలో ఏ లోటూ రానీయడు సుమా! అని సమాధానపరచి లక్ష్మణుని ప్రసన్నునిగ చేసెను.

సహజంగా తమ కళ్ళముందు జరుగుతున్న విషయాలలో ఎవరితో ఏమంటే ఏ ప్రమాదం ముంచుకు వస్తుందో మనకెందుకులే కాసేపు కళ్ళు మూసుకుని మౌనం వహిస్తే పోలా" అని సరి పెట్టుకునే మనస్తత్వం కలవాళ్ళే ఎక్కువమంది సమాజంలో తారసపడతారు. సకాలంలో సరియైన సలహా యీయగలిగికూడా యీయరు. లోపాలను చెప్పరు. పొగడ్తలతో మాత్రం ముంచెత్తుతారు అవకాశవాదులు ఎటుచూసినా వారికి స్వార్థం అడ్డు వస్తుంది. స్వార్థానికై ఎదుటివారిని బలి తీసుకుంటానికి కూడా సిద్ధపడతారు. స్వార్థం కొంచెం ప్రక్కనపెట్టి పరార్థంకోసం పాటుపడరు. ఏ ఇంటిలో దీపం వెలగకపోతే మాకేం-మా ఇంటిలో దీపం వెలగాలి అనుకుంటుంటారు. అట్టివారి విధానానికి ఆంజనేయుని నీతిజ్ఞత ఒక చురక. ఏమాత్రం బెరుకు లేకుండగా ధైర్యంగా ఎదుటివారిలోని లోపాలను తగినసమయంలో నొప్పింపని రీతిలో ఎత్తిచూపి-తగిన జాగరూకత వహించునట్లు చేయగల మతిమంతుడు, సారథి, సచివుడుగా యీ పై సన్నివేశంలో కనిపిస్తాడు హనుమంతుడు. మంచన మతి మహత్తును ఇలా చెప్పాడు-

మఱియు కళాకృషి బీజము
మఱియు తను ఫలప్రదక్షిమాజము తలపన్
మఱియు చెలి మఱియు చుట్టము
మఱిహీనులు చూడ మొరడు మ్రాకులు ధాత్రిన్.

## విశ్వాసపాత్రత

రామాజ్ఞ ననుసరించి సుగ్రీవుడు సీతాన్వేషణకై వానర యోధులను వీరవరుల నేతృత్వంలో నాలుగు దిక్కులకూ పంపుచూ ఆయా దిగ్విశేషాలను వివరించి ఇలా అంటాడు.

కపివరులారా! మీరందరూ కడు జాగరూకతతో సీతాదేవిని కనిపెట్టి వెతకండి. మీకు గడువు ముప్పది రోజులు మాత్రమే. అలాకాక ఆపై ఒక్కరోజు జాగుచేసినా- మీకు మరణశిక్షయే. ఇదే సుగ్రీవాజ్ఞ.

ఇక దక్షిణ దిశగా పయనమైన వానరసేనకు అంగదుడు నాయకుడు. జాంబవహనుమంతాది కపి వీరులు అంగదునికి బాసటగ పయనమయ్యారు. ఇంతలో సుగ్రీవుడు మతిమంతుడైన హనుమంతుని దగ్గరకు పిలచి

విశేషేణతు సుగ్రీవో హనుమత్యర్థముక్తవాన్
న హితస్మిన్ హరిశ్రేష్ఠే నిశ్చితార్థోర్థ సాధనే.
న భూమౌ నాంతరిక్షేవా నాంబరే నామరాలయే
నాప్స్వనా గతిభంగం తే పశ్యామి హరిపుంగవ.
సా సురాః సహ గంధర్వాః స నాగ నరదేవతాః
విదితాః సర్వలోకాస్తే స సాగర ధరా ధరాః.

గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవం చ మహాకపే
పితుస్తే సదృశం వీర మారుతస్య మహౌజసః.
తేజసా వాపి తే భూతం న సమం భువి విద్యతే
తద్యథా లభ్యతే సీతా తత్త్వమేవాను చింతయ.
త్వయ్యేవ హనుమన్నస్తి బలం వృద్ధిః పరాక్రమః
దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయ పండిత.

అన్నిదిక్కుల సీతను వెదుక వానర సైన్యమును పంపినా సుగ్రీవునికి మాత్రం యీ కార్యమును సాధింపగలవాడు హనుమ మాత్రమే అన్నది దృఢమైన విశ్వాసము.

హనుమా! నేలమీద, నింగిలో, నీటిలో నీవు చొరరాని చోటు లేదు. దేవలోకాన కూడ నీ పయనం ఆపరానిది. నీవు ప్రవేశించలేని చోటు ఎచటా లేదు. నీకు తెలియని చోటు లేదు. సర్వ లోకాలలో సంచరించగలవాడవు. గంధర్వ, యక్ష, నాగ, కిన్నర, కింపురుష, దేవ, దానవ నివాస భూములన్నీ నీకు సుపరిచితాలే. గమన వేగంలో తండ్రికి తగిన తనయుడవు. బల, పరాక్రమ, సాహసాలలో నీకు నీవే సాటి. దేశ కాలానుకూలంగా సంభాషించగల నేర్పు నీకు వెన్నతో పెట్టిన విద్య. సర్వకార్య సమర్థుడవైన నీకు నేను చెప్పవలసినది లేదు. ఈ కార్య భారాన్ని నీ భుజ స్కంధాల మీద పెడుతున్నాను. విజయుడవై తిరిగిరా! అంటూన్న మాటలు రాముడు విన్నాడు.

వ్యవసాయశ్చ తే వీర సత్వయుక్తశ్చ విక్రమః
సుగ్రీవస్య చ సందేశః సిద్ధిం కథయతీవ మే.

ఓ వీరుడా! నీ ఉత్సాహ బల విక్రమాలు నేనెరుగుదును. సుగ్రీవుడు నీతో చెప్పిన సందేశమూ, కార్యసిద్ధి నీవలననే అగునని

నాకు చెప్పుచున్నట్లున్నది. నయపండితా! ఇది నా నామాంకిత మైన ఉంగరము. దీనిని నీదగ్గర ఉంచు. ఇది చూచిన సీత తప్పక నిన్ను నమ్మును. ఈ కార్యమునకు నీవే తగినవాడవు. నీకు శుభ మగు గాక! అని తన అంగుళీయకము నిచ్చి ఆశీర్వదించి పంపెను.

ఈ సందర్భమున ఆంజనేయునకు దూతకు కావలసిన లక్షణములు కలవనియు, కార్యసాధనా సంపత్తి అతనిలో కల వనియు రామ, సుగ్రీవులకున్న వీకాభిప్రాయము. కావుననే అంత మంది వానర యోధులున్నను స్వనామాంకిత అంగుళీయకాన్ని హనుమంతున కిచ్చుట జరిగినది.

అధికారుల మన్ననలను పొందుటకు కేవలం బాజాబజం త్రీలను ఊదటం కాక ప్రతి మానవుడు శక్తి సామర్థ్యాలతో ప్రభు వుల ప్రశంసల నందుకోవాలేకాని పక్కదారులు, అడ్డదారులు తొక్కరాదు. ప్రతిభకు పట్టం కట్టాలి. సేవానిరతి కలిగి ఉండాలి. ఇది ఇచట హనుమంతుని ఆదర్శం. సేవకావృత్తి ఆత్మార్పణగ ఉండాలి. విశ్వాసము, భక్తి, శ్రద్ధలు కలిగి ఉండాలి.

## ఆలోచనా శక్తి

దక్షిణ దిశగా ఆయా ప్రాంతాల విశేషాలను పరికిస్తూ అంగద, జాంబవంత, హనుమంతాది వానర వీరులు ముందుకు సాగుతున్నారు. విరామ మెరుగని పయనం. ఆకలిబాధ తీవ్ర మయింది. సుగ్రీవుడు చెప్పిన దారితప్పి నదీ ప్రాంతాలను, పర్వత, అరణ్య భూములను దాటి ఒక బిలద్వారం చేరాయి. ఎటు చూచినా ఆకలిదప్పులు తీర్చగల ఫల వృక్షాలుగాని, నీటి మడు గులుగాని కానరాలేదు. ఐతే ఆ బిలద్వారం నుండి తడి ముక్కు లతో నీటి పక్షులు రావటం చూచాడు పవన తనయుడు. అదే

విషయం తనవారికి చెప్పాడు. "మిత్రులారా! అటుచూడండి. హంసలు, క్రౌంచ పక్షులు, చక్రవాకాలు, బెగ్గురు పక్షులు తడిసిన రెక్కలతో బిలం నుండి బయటకు వస్తున్నాయి. కాబట్టి యీ బిలంలో– సరోవరాలో, దిగుడు బావులో ఉండిఉండాలి. అంతే కాక బిల ప్రాంతాన వృక్షాలుకూడా ఉన్నాయి"

అందరూ కలసి ఆ బిలం చేరారు. అదే స్వయంప్రభా బిలం. నెమ్మదిగా బిలంలోకి దిగారు. నాలుగడుగులు వేశారో లేదో వీరనుకున్నట్లుగా నీటి మడుగు కనిపించకపోగా కనీసం వెలుతురు కూడా లేదు. అంతా చీకటి. కన్ను పొడుచుకున్నా దారి కానరావటం లేదు పైగా ఇరుకు దారి. ఒకరిని పట్టుకుని మరొకరు నడవసాగారు. కొద్దిదూరం ఇలా సాగింది వారి నడక.

ఇంకొంచెం ముందుకు వెళ్ళగా నయనానందకరంగా వెలుగు కనిపించింది. మున్ముందుకు సాగగానే సుమధుర జలాల సరోవరాలూ, మధువొలుకు ఫల పుష్పభరిత వృక్షాలూ, తమాల, సాల, తాల, అశోక, చంపక, పున్నాగాది వృక్షతతులూ కనులపండుగ చేయుచూ కాన్పించినవి. అటునిటు తిరుగుచుండగా ఇంతకు ముందెన్నడు చూడని అత్యద్భుతమైన రమణీయ సుందర మందిర మొకదానిని చూచారు. లోనికేగి చూచుచుండగా మృగచర్మ ధారిణీ, పద్మాసనాసీన, నిమీలితనేత్రయై తేజఃపుంజములు వెదజల్లు ఒక తాపసిని చూచారు. అది స్వయంప్రభా మందిరం. ఆమెయే స్వయంప్రభ

## చుట్టమగు మధుర వాక్యము కలిమిన్

వానర సైన్యానికిదొక పరీక్ష సమయం. ఇపుడేం చేయాలో తెలియక వారు ఒకరి మొగముల నొకరు చూచుకొనుచుండగా.

సంకట హరణుడు, పవమాన సుతుడు ఆమెను చేరి మోకరిల్లి-

అమ్మా! నీవెవరివి? ఎవరిదీ మందిరం? మేము రామకార్యార్థమై సీతామాతను వెతుకుచు అలసి ఆకలి దప్పులకు లోనై ఈ చోటికేతెంచినాము అంటూ తమ వివరాలను పూసగ్రుచ్చినటుల సవివరంగా మధుర వాగ్ధాటితో వివరించగా- స్వయంప్రభ సజల నయనాలతో ముందు మీరు స్వాదునీరముల గ్రోలి, మధుర ఫలాల భక్షించుడని అనుమతిచ్చెను. ఆపై తన వృత్తాంతమును చెప్పి "కనులు మూసుకొనుడు, మీరీ బిలమునుండి బయల్పడ గలరని" చెప్పి బయల్పడు దారి కానరాక దిగాలుచెందినవారి నటుల అనుగ్రహించినది!

ఈ సన్నివేశంలో ఆంజనేయుడు- ప్రవేశించరాని ప్రదేశం చేరినపుడు- అందు ప్రతి అణువును పరిశీలించుచు, అంటే పరిసరాలను గమనించుచు- ప్రకృతి మార్పులను చూచుచుండవలెనని, దారితెన్నులను గూర్చి, తమ అవసరాలను గూర్చి తెలుసుకొనుటకై అచటివారి ఆగ్రహమునకు గురికాకుండ- అనుగ్రహ పాత్రులగుటకు కావలసిన మాటనేర్పు నుపయోగించి తనను, తనవారిని విషమ పరిస్థితులనుండి ఎలా తప్పింపవలెనో చూపిన విధానము అవశ్యం ఆచరింపతగినది, అలవరచుకోవలసినదీ. అందుకే ఒక కవి మాటకారిత్వమును గూర్చి.—

కాకేమి తన్ను తిట్టెనె
కోకిల తన్నేమి కోకొమ్మనెనే
లోకము పగయగు బరుసని
వాకున జుట్టమగు మధుర వాక్యము కలిమిన్— అంటాడు.

ఆ అనుగ్రహంతో బిలద్వారం వెలుపల గల అడవిలోనికి రాగలిగారు. అప్పటికి సుగ్రీవుడిచ్చిన నెల రోజుల గడువు

పూర్తయినది. ఇంతదనుక చూచాయగనైన సీత జాడ తెలియ రాలేదు. తక్షిణదిశగా తిరుగవలసిన ప్రదేశమంతయు తిరిగినట్లు యినది. ఇక సుగ్రీవుని ఆగ్రహమున కెరగాక తప్పదు. ప్రాయోప వేశమే మనకిక శరణ్యము అని తిరుగుచున్నంతలో జటాయువు సోదరుడు సంపాతి తారసపడినాడు. మాటల సందర్భంలో రావ ణుని గూర్చిన పంగతులన్నీ చెప్పాడు. ఇక వానరుల ఆనందానికి హద్దు లేదు.

## జితేంద్రియుడు

సంతోషాతిశయంతో సముద్రపుటొడ్డు చేరారు. సాగరాన్ని చూడగానే అంత సంతోషం ఒక్కసారి మటుమాయమయింది. శతయోజన విస్తీర్ణ సాగరాన్ని తరించేది ఎలాగ? అందరి ముఖాలు వెలవెలబోతున్నాయి. తమలో ఎవరెవరు ఎంతవరకు ఎగురగలరో చల్లగ చెబుతున్నారు. "ఈ సముద్ర లంఘన వయసులోనైతే నా వల్లయ్యేదేగాని ఇపుడు వార్ధక్య భారం కారణంగా అంత దూరం ఎగురలేను. ఐనా తొంబై యోజనాలు వెళ్ళిరాగలను. నేనీనాటి వాడనా!" అంటూ తన వయస్సును, అనుభవాలను అందు కున్నాడు జాంబవంతుడు. ఇలా అందరూ ఒకచోట చేరి సాగర తీర్ణం- తమ శక్తి సామర్థ్యాలను గురించి చెప్పుకుంటుంటే- "నేను ఛస్తే లేవను- లేచానా మనిషిని కాను" అని కుంటివాడు అన్న ట్లుంది వీరి ప్రసంగ ధోరణి.

## కార్యసాధకుడు మాటలలో మూగ, చేతలలో సర్వసమర్థుడు

ఇంత జరుగుతున్నా తనకేమీ పట్టనట్లు మునిలా మౌన ముద్రాంకితుడై ఏదో అనిర్వచనీయ ఆనందానుభూతుల్లో ఓలలాడు

తున్న ఆంజనేయుని చూచాడు జాంబవంతుడు. అతని కనులు ఆంజనేయునిపై బడినై. అతడే అనితరసాధ్య సాధకుడను కున్నాడు. దగ్గరకు చేరి ఇలా అన్నాడు.

సర్వశాస్త్ర విశారదా! హనుమా! ఏమీ పట్టనట్లు మౌనంగా, ఒంటరిగా కూర్చున్నావేమయ్యా!

"తూష్ణీం ఏకాంతమాశ్రిత్య హనుమన్ కిం న జల్పసి"

నీవిటులుంటే మమ్మీవిపదంబుధి నుండి దాటింపగలవా రెవరయ్యా! అమిత బలశక్తి సంపన్నా! యీ సముద్ర లంఘనం నీకొక లెఖ్ఖా! తండ్రికి తగిన తనయుడవే!! వైనతేయునంత బాహు బలశాలివి కదా! నీ భుజబల, బుద్ధి బలాలలో సాటిరాగల వాడీరేడు జగాల వీరయ్యా!! ఇక మౌనం చాలు. దిగాలుపడి, విషణ్ణవదనాలతో నున్న నీవారిని ఒకసారి చూడు. పటుతర బుద్ధి శాలివై లేచి- కాలయాపన చేయక సముద్రమును దాట సిద్ధంకా! సీతామాతను చూచిరా! నీపై ఆశతో ప్రాణాలు నిలుపుకున్న వీరం దరిని కాపాడు. కేసరి పుత్రా! ఆంజనేయా! సుగ్రీవ సమానుడవు. తేజోబల సంపదలలో రామ లక్ష్మణు లంతటివాడవు" అన్నాడు. జాంబవంతుని మాటలు విని వానరులు హర్షధ్వానాలతో తమ ఆమోదం తెల్పినారు. ఈ పొగడ్త వలన ఆంజనేయుడు పర్వదినా లలో ఉప్పొంగే ఉదధిలా ఎదిగాడు. తన బలం తనకు తెలిసి వచ్చింది. నిదురించే సింహం మేల్కొంచి జూలు విదిలించి నట్లయిరంది.

**నమావిద్ధ్యచ లాంగూలం హర్షాచ్చ బలమేయివాన్**
**తేజసా పూర్వమాణస్య రూపమాసీద నుత్తమం.**

వాలాన్ని విపరీతంగా పెంచాడు. అతని రూపం వెలుగుల జిలుగులతో నిండింది. "తాతా! నన్నిపుడేం చేయమంటావో చెప్పు. ఇదో గొప్ప పనా? ముజ్జగాల నాక్రమించిన వామనునిలా నేనీ సాగరాన్ని లంఘిస్తాను. లంకా నగరాన్ని గాలించి గాలించి తిరిగి రాగలను అంతేకాదు. సమూలంగా వాలంతో లంకనే పెకలించి తెస్తాను. రామబాణంలా అమిత వేగంగా దూసుకు పోగలను. తిరుగులేని నా పయన వేగాన్ని ఎవరూ ఆపలేరు ఆ వేగంతో సీతామాతకై ముల్లోకాలూ వెతుకుతాను. రావణునైనా బంధించి మీముందుంచగలను. నా గమన వేగాన్ని అందుకోగలవారు నా తండ్రి వాయుదేవుడు, గరుత్మంతుడు మాత్రమే. మీరిక నిశ్చింతగా ఉండండి. త్రికరణశుద్ధిగా నేనీ కార్యాన్ని సాధించగలను" అన్నాడు. వింటూన్న వానరులకు హర్షాతిరేకంతో రోమరోమం నిక్కబొడుచుకుంది. సంతోషంగా కరతాళ ధ్వనులు చేశారు

వానరాన్వానరశ్రేష్ఠ ఇదం వచనమబ్రవీత్
యథా రాఘవ నిర్ముక్తి శ్శరశ్శ్వసన విక్రమః.
గచ్ఛే త్తద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితాం
నహి ద్రక్ష్యామి యదితాం లంకాయాం జనకాత్మజాం.
అనేనైవహి వేగేన గమిష్యామి సురాలయం
యది వాత్రిదివే సీతాం నద్రక్షామ్యకృతశ్రమః.
బద్ధ్వా రాక్షసరాజానమానయిష్యామి రావణం
సర్వథా కృతకార్యోహ మేష్యామి సహసీతయా.
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణం
ఏవముక్త్వాతు హనుమాన్ వానరాన్ వానరోత్తమః.

ఇది హనుమంతుని ప్రజ్ఞా వైభవం. సామాన్యంగా కార్య సాధకులు మాటలలో మూగగాను, చేతలలో సర్వ సమర్థులుగా నుండటం జగత్ప్రసిద్ధం, ఐతే ఇచట తనను గురించి తాను ఇంత గొప్పగా చెప్పకొనుట సమంజసమా. అంటే ఒక్కసారి అంజనేయుని పాత్రను గమనిస్తే ఏ సందర్భంలో ఎలా ప్రవర్తించాడో గమనించినట్లయితే సన్నివేశానికి తగిన రీతిగా తాను స్పందిస్తూ తనవారిని కాపాడే విధానం చూడగలం. సుగ్రీవుడిచ్చిన గడువు పూర్తయింది. తిరగవలసిన తావులన్నీ తిరిగారు. కార్యం సాధించగలం అన్న ఆశే లేదు. ఆశ మానవునిలో నైరాశ్యాన్ని రూపుమాపుతుంది. మరి వారి ఆశ ఎండమావే. ప్రాణత్యాగం వినా మరోదారి లేదన్న భావనలోకి వచ్చారు మరి ఆ సందర్భంలో తనవారిని ఉత్తేజితులను చేయాలి అంటే వారిని ఉత్సాహపరచాలి, కొత్త రక్తం నింపాలి. మాటలలో, చేతలలో తనలోని ప్రవర్తనను చూచి వారుకూడ అదె స్ఫూర్తితో చైతన్యవంతులవుతారు, అపుడే కర్తవ్యోన్ముఖులై కార్యసాధకులౌతారు. అదే యిచట జరిగింది. అంతే తప్ప స్వాతిశయంగాని, మరొకటిగాని కాదు. భావితరాలవారికి అందించిన అంజనేయుని స్ఫూర్తి చైతన్యదీప్తి.

అంజనేయుని మాటలకు జాంబవంతుడు సంతోషించి, "పవనతనయా! వానర జాతిని సంరక్షించే శక్తియుక్తులు నీకున్నయ్. మహర్షుల, దేవర్షుల, గురువుల అనుగ్రహ వీక్షణం నీకుంది. దేవతాప్రసాదసిద్ధి గలవాడవు. అందరూ నీ క్షేమాన్నే కోరుకుంటుంటారు. కార్యసాధకుడవై తిరిగి వచ్చేవరకు నీకై ఎదురు చూస్తుంటాం" అన్నాడు.

## ఉత్తిష్ఠత-జాగ్రత-ప్రాప్యవరాన్నిబోధత

ఇలా పలికిన జాంబవంతుని మాటలు సకల దేవతా వర ప్రసాదియైన ఆంజనేయుని ధీవైభవాన్నీ- బల పరాక్రమ శక్తియుక్తులను తక్షణం స్ఫురణకు తెచ్చినయ్. అంతే అమితోత్సాహంతో ఇంతై ఇంతింతై ఎదుగుతూ "ఒడలు విరిచి ఒక్కసారి మెడ ముందుకు సాచిన మహా వృషభము"ను పోలి ఉన్నాడు. నిరాశ చెంది దిగాలుపడిన వానరుల ఆనందానికి పట్టపగ్గాలు లేవు.

తతో రావణనీతాయాః సీతాయాః శత్రుకర్మనః
ఇయేష పదమన్వేష్టుం చారణా చరితే పథి ॥

శత్రుకర్మనుడు ఆంజనేయుడు సిద్ధచారణులు విహరించే వినువీథిన సముద్రాన్ని దాటటానికై మహేంద్రగిరిపై నిలచాడు. అతని పదఘట్టనకు అంతటి కొండ గజగజలాడింది అదేమో అర్థంకాక గుహలలోని జంతువులు బయటకు భయంగా పరుగులు తీసినై. భయంకర విషసర్పాలు బుసలు కొడుతూ రాళ్ళను కాటేస్తున్నాయి. ఆ గిరిపై విహరింప వచ్చిన గంధర్వ. సిద్ధచారణులు భయకంపితులై పరుగులు తీశారు. చెట్లు ఒక్కసారి కదలి పూలను జలజలా రాల్చాయి. ఆ సమయాన మహేంద్రగిరి పూల కొండలా భాసించింది.

తన కార్య సాఫల్యతను కోరుచూ పావని సూర్య, ఇంద్ర, బ్రహ్మాది దేవతలకూ- తన తండ్రి వాయుదేవునికీ నమస్కరించాడు. పర్వదినాలలో పొంగే సముద్రునిలా- సర్వ శక్తులను కూడగట్టుకొని పిడికిళ్ళు బిగించి ఒక్క ఉదుటున గగనాని కెగసాడు. ఆ ఊరు వేగోద్ధతికి కూకటివేళ్ళతో పెకలింపబడి వృక్షాలు పైకెగసినై. అవి దూర తీరాలకు సాగిపోవు బంధుగులను సాగనంప

వచ్చినవారివలె కన్పించినై ఆ గమన వేగం కదలిని కల్లోల పర చింది. తిమి తిమింగలాది జలచరాలు నీటిని వీడి బయటకెగరినై.

మహర్షులు చుక్కల వీధిని చేరి రామకార్యార్థమై ఏగు ఆంజనేయుని గమన వేగోద్ధతిని చెప్పుకొనుట విద్యాధరాది దేవ గణం విని పరవశమానసులయ్యారు. హనుమను ఆశీర్వదించారు. పయనించే మారుతివాలం ఒకసారి ఇంద్రచాపంలా, మరో సారి దేహానికి కప్పబడి చక్రాకారంలా కానవచ్చింది. గాలి తాకి డికి సాగరం మహోత్తుంగ తాల తరంగాలతో ఎగిసిపడింది.

ఈ మహత్కార్యంలో పవన తనయునికి తనవంతు సాయం అందించదలచాడు సాగరుడు. సాగరుడు సగర వర్ధితుడు. సగరుడు ఇక్ష్వాకు వంశీయుడు. అదే వంశ సంజాతుడు రాముడు. రామ కార్యార్థి హనుమంతుడు. తనకు అతిథి. అతనికి సేవలందించు బాధ్యత తనది. అందుకే తనలో దాగిన మైనాకుని "నీకూ నాకూ పూజనీయుడైన సమీర కుమారుని నీ శిఖరాలతో ఆతిథ్యం యివ్వ వలసినది" అని ప్రోత్సహించాడు. మైనాకుడు తన శిఖరాన్ని గగనమంత ఎత్తుకు పెంచాడు.

తన దారికడ్డంగా నున్న గిరి శిఖరాన్ని చూచి ఇదొక విఘ్న ముగా భావించి (విఘ్నోయమితి నిశ్చితః) అమిత బలసంపన్నుడు అంజనానందనుడు వేగంగా, బలంగా ఢీకొట్టాడు. ఆ తాకిడికి తత్తరపడి- తేరుకుని మారుతి శక్తిసంపన్నతను మెచ్చుకొనుచు మైనాకుడు తన శిఖరాలపై మానవాకృతిన నిలబడి—

మహావీరా! నీవు వాయు కుమారుడవు. అయ్యనిలుడు నాకు అత్యంతాప్తుడు. ఎలాగంటే- ఒకనాడు పర్వతాలకు రెక్కలుండేవి. పక్షుల వలెనే పైకెగిరేవి. ఏనిమిషాన అవి తమపైబడునో యని అర

చేత ప్రాణాలు పట్టుకొని దినదినగండంగా సమస్త ప్రాణిలోకం ప్రాణభీతితో అల్లాడసాగింది. ఇది ఇంద్రునికి కోపకారణమైంది. వెంటనే తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు నరకటం మొదలుపెట్టాడు. అపుడు నేను నా ప్రాణసఖుడైన వాయుదేవుని 'ఇంద్రబారి నుండి కాపాడమని' కోరాను. వాయుదేవుడు కరుణించి నన్ను ఈ సముద్రంలోకి విసిరివైచినాడు. రామ కార్యార్థమై సముద్రమును దాటు నీవు అకారణంగా నాకు మాననీయుడవు, పూజనీయుడవు. నిన్ను పూజించిన నా మిత్రుడు వాయుదేవుని పూజించినట్లే. (పూజితే త్వయి ధర్మజ్ఞే పూజాం ప్రాప్నోతి మారుతః) అంతేకాక సముద్రుడును నీకు విశ్రాంతిని కల్గించమని నన్ను ప్రేరేపించినాడు.

కాన నా ఈ శిఖరాలపై గల మధుర ఫలాలను ఆస్వాదించి కొంత విశ్రాంతి తీసుకొమ్మని కోరగా- మైనాకుని మాటలకు మారుతి సంతసించెను. "మైనాకా! నీ ధార్మిక బుద్ధి అభినందనీయం. కాని రామకార్యార్థినై వెడలు నేను ఒక్క క్షణమైనా ఆగను. ఇది నా నిశ్చయము. పని తొందరలో నున్నాను" అని మైనాకుని స్పృశించి "నీ ఆతిథ్యము నందుకున్నట్లే" అని అమిత వేగంగా ముందుకు సాగాడు.

త్వరతే కార్యకాలోమే అహశ్చాప్యతి వర్తతే
ప్రతిజ్ఞాచ మయా దత్తా న స్థాతవ్యమిహాంతరే.

ఈ దృశ్యాన్ని తిలకించు గగన సంచారులు, విద్యాధరాది అప్సరోగణం 'సెహబాస్ వానరపుంగవా' అంటూ హనుమంతుని ఎంతగానో మెచ్చుకున్నారు.

హనుమంతుని శక్తిని, బలాన్ని పరీక్షించవలసిందిగా సిద్ధులు, గంధర్వులు నాగమాత సురసను కోరారు. సురస వికృతాకారంతో,

భీకర రూపముతో "ఏనాడో బ్రహ్మ నిన్ను నాకాహారంగ నిర్ణయించాడు. ఇప్పుడే నిన్ను మింగుతాను. కమ్మగ కడుపునకు విందు చేస్తాను' అంటూ హనుమంతుని ఎదుట నిలచి నోరు తెరచింది. ఇది మరో విఘ్నము కాబోలు ననుకుని పావని ప్రశాంతచిత్తుడై తన ప్రయాణ కారణం వివరంగా చెప్పి- తిరిగివచ్చి నీకాహార మౌతాను దారి కడ్డుతొలగమని కోరాడు.

సురస 'ససేమిరా నిను వదలను, వదలను ఇప్పుడే భక్షిస్తాను' అంటూనే నోరు పెద్దది చేసింది. అంజనేయుడు ఆ నోటిలో పట్టునంతగా దేహాన్ని పెంచాడు. సురస ఇంకా తన దేహం పెంచి పెద్ద నోరు తెరచింది. బుద్ధిశాలి ఆంజనేయుడు ఇదే అదనుగ భావించి లిప్తమాత్ర కాలంలో అంగుష్ఠమాత్రుడై నోటిలో ప్రవేశించి మరల తిరిగివచ్చి, "అమ్మా! నీమాట నెగ్గిందికదా! ఇక నాకు సెలవా" అన్నాడు.

ఆనందాశ్రువులు రాల సురస ధీమంతుని హనుమంతుని కొనియాడి "కార్యసిద్ధి నందుదువుగాక!'' అని ఆశీర్వదించి "రామునితో సీతను చేర్చు" అని పల్కింది.

అర్థ సిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథా సుఖం
సమానయస్వ వై దేహీం రాఘవేణ మహాత్మనా

ఎంతగ ఆటంకము లేర్పడుచున్నవో అంతగ రెట్టించిన వేగంతో రామబాణంలా ముందుకు దూసుకుపోతున్నాడు. కొంత దూరంమాత్రమే యీ నడక సాగింది ఇంతలో తన్నెవరో బలవంతంగా పట్టి తన గమనాన్ని వెనుకకు లాగుచున్నట్లనిపించింది. చుట్టూ కలయచూచాడు. ఎవరూ కానరాలేదు. మతిమంతుడు కావడం వలన ఆలోచించి అవలోకించగా తన నీడను పట్టి నీటిలో

నుండి ఎవరో లాగుతున్నట్లనిపించింది. అదే సింహికా నామ రక్కసి. ఛాయాగ్రాహిణి. అదొక హింసిక. ఏదో ఒకనాడు-'దక్షిణ సముద్రంలో ఒక భయంకర రక్కసి కలదని, నీడను పట్టి లాగి వైచి హతమార్చ గలదని, ఆ ప్రాంతాని కేగినపుడు తగు జాగరూకత వహించవలెనని' సుగ్రీవుడు చెప్పినట్లు హనుమకు గుర్తు వచ్చింది. 'ఇదే కావచ్చు' ననుకున్నాడు.

నీటిలోనికి దృష్టి సారించాడు. సింహిక నోటిని తెరచి హనుమంతుని మింగుటకు సిద్ధంగా ఉంది మారుతి శరీరం పెంచాడు. సింహిక ఇంకా తన నోటిని పెద్దది చేసింది. నోటిలో సింహిక జీవ స్థానాలు కనిపించినై. అంతే. ఆంజనేయుడు అంగుష్ఠమాత్రుడై నోటిలో ప్రవేశించి దాని మర్మస్థానాలు తన వజ్ర నఖాలతో చీల్చి నిమేషమాత్రంలో బహిర్గతుడయినాడు. సింహిక జవజీవాలు చలించినై. అచేతనురాలై తిరిగిరాని లోకాలకు తరలివెళ్ళింది. సింహిక కళేబరం నీటిపై తేలియాడింది.

ఆంజనేయుని యీ సముద్రయానం గమనించిన కార్య సాధకున కుండవలసిన ధైర్యము, ఉత్సాహము, కార్యదీక్ష, కర్తవ్యపరాయణత్వాది లక్షణాలు తేటతెల్లము కాగలవు

"నడచుచు నుండువాని చరణంబులకేగద రాళ్ళు తాకుడుల్" అంటాడు ఒక కవి. రాళ్ళు తగులునని కూర్చుంటే గమ్యం చేరగలమా! తగిలే రాళ్ళను తప్పుకుంటూ ముందుకు సాగాలే కాని ఆగరాదు. కొంతదూరం వెళ్ళి ఎదురుదెబ్బలకు జంకి వెనుకకు తిరిగిరారాదు. బుద్ధివిశేషంతో ముందుకే ముమ్ముందుకే సాగి సత్ఫలితాల నందుకోవాలి. అంతేకాదు, మార్గమధ్యంలో లభించిన వానితో సంతృప్తిపడి ఆగిపోరాదు. తన దృష్టిని గమ్యం మీదనే

కేంద్రీకరించాలి. ఉత్తిష్ఠత-జాగ్రత-ప్రాప్యవరాన్నిబోధత" లే జాగరూకుడవై గమ్యం చేరువరకు ఆగకు అంటుంది కఠోపనిషత్తు.

నిజంగా ఒక్కసారి ఆలోచిస్తే 'శ్రేయాంసి బహు విఘ్నాని' మంచిపనికే ఆటంకాలెక్కువ అనుట నూటికి నూరుపాళ్ళు నిజం ప్రతి కార్యంలో.

ఆంజనేయుడు మైనాకుని ఆతిథ్యం స్వీకరిస్తూ కర్తవ్యం మరచి స్వార్థ సుఖానికి చోటిస్తే- పట్టుదల తరుగుతుందేకాని పెరగదు కదా! ఉత్సాహం కొరవడేది. నిరుత్సాహం కార్యతిరోగమనకారి.

నాగమాత సురస సందర్భంలో అపాయాన్ని దాటటానికి బుద్ధిబలం ఉపయోగించేవేళ తొందరపడినా- ఆవేశం పెంచుకున్నా ఆవేదన తప్ప మరేముంటుంది. అందుకే ఆంజనేయుడు బుద్ధివైభవంతో యుక్తియుక్తంగా చరించి ముందుకు సాగాడు.

కనిపించని హింసిక సింహిక. ఆమె విషయంలో ఆలోచన పనికిరాదు. కాలాతీతం కారాదు. కార్యభంగం కానిరీతిలో తన శక్తితో రక్తి కట్టించాడు. సింహిక మరణవార్త విన్న గగనగాములు

యస్యత్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ
ధృతిర్దృష్టిర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న శీదతి.

అంటారు. ధైర్యం, ముందుచూపు, బుద్ధిబలం, బాహు బలం-యీ నాలుగు లక్షణాలు ఎవరికుంటవో వారే కార్యనిర్వహణాదక్షులు. ఇయ్యవి పుష్కలంగా హనుమంతునిలో గోచరిస్తున్నాయి.

ఏదేని ఒక కార్యము తలపెట్టినవానిని చూచి శల్యసారథ్యం చేసేవారు కొందరైతే, శకుని పాత్రధారులు మరికొందరు.

ఇంకొందరైతే కల్లబొల్లి కబుర్లతో ముందుకు సాగనీయరు. ఇదో రకం కార్యభంగం. ఇటువంటివారినందరినీ ఒక కంట కని పెడుతూ వినదగు నెవ్వరు చెప్పిన అన్నట్లు వింటూనే గమ్యమే లక్ష్యసాధనగా విఘ్ననిహన్యమానులగుచు ప్రజ్ఞానిధులుగా కార్య సాఫల్యత నందాలి సుమా అని కర్తవ్యబోధ చేశాడు హనుమ.

## వివేకంతో విరోధిని నిరోధించాలి

మారుతి ఇలా అవరోధాలను అధిగమించి లంకాతీరంలో సముద్రప్రాంతాన గల త్రికూట పర్వత శిఖరంపై దిగాడు. ఇంత దూరం పయనించినా ఇసుమంత కందలేదు. తనువు విశ్రాంతిని కోరటం లేదు. ఉత్సాహం కించిత్తయినా కొరవడలేదు. పైగా యీ నూరు యోజనాలే కాదు, ఎన్ని నూరు యోజనాలయినా ఇట్టే వెళ్ళిరాగలను. ఇంత పెద్ద శరీరంతో నున్న తనను తేలికగా రాక్షసులు గుర్తించగలరని తలచి సూక్ష్మరూపాన్ని ధరించాడు. లంకా నగరాన్ని తేరిపార చూచాడు.

విశ్వకర్మ నిర్మితమైన యీ లంకా నగరం రావణు రాజధాని. అభేద్యమైనది. శత్రువులు ప్రవేశింపరానిది కట్టుదిట్టమైన రక్షణ వ్యవస్థతో పటిష్టమైన లంకా నగరాన్ని ప్రవేశించేదెలాగ? సీతామాత జీవించియున్నదో, లేదో? రక్కసు లెంతకైనా తగినవారు? ఆమెను భక్షించి యుండరు కదా! రావణుడామెను సముద్రము పాల్జేసినాడో! ఏమో! అని ఆంజనేయుని మనస్సులో పరిపరివిధముల ఆలోచనలు చెలరేగినవ్. ఈ లంకను తానుకాక సుగ్రీవాంగద నీలులు మాత్రమే దాటగల సమర్థులు. సరే ఐనను లంకను చేరి

సీతాసాధ్విని శోధించాలి అని లంకానగరివైపు నాలుగడుగులు వేశాడో లేదో లంకాధిష్టాత్రి లంకిణి చూడనే చూచింది.

కస్త్వం కేనచ కార్యేణ ఇహప్రాప్తో వనాలయ
కథయ స్వేహ యత్తత్త్వం యావత్ప్రాణా ధరంతి తే.
న శక్యం ఖల్వియం లంకా ప్రవేష్టుం వానర త్వయా
రక్షితా రావణబలై రభిగుప్తా సమం తతః.

"ఎవడవురా నీవు! అడవిలో చెట్టుకొమ్మలపై తిరుగాడు కోతివి. ఈవైపునకేల వచ్చితివి. ప్రాణాలతో నుండాలంటే వెను దిరుగు. ఇతరులెవరూ చొరరాని యీ లంకా నగరంలో కాలిడదల చిన నీకు మరణమే శరణము" అని భీకర గర్జన చేసింది.

కథయిష్యామి తే తత్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి.
కా త్వం విరూప నయనా పురద్వారేవ తిష్ఠసి
కిమర్థంచాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా.

నేనెవరినో చెబుతాను. ముందు నీవెవరివో చెప్పు ? వాకిలి కడ్డంగా నిలబడి భీకరాకృతితో వికార నయనాలతో నన్నెందుకు బెదిరించాలనుకుంటున్నావు ? హనుమ మాటలు విన్న లంకిణి క్రోధావేశంతో ఓ ప్లవంగమా! రావణుని ఆజ్ఞతో యీ లంకా ద్వారాన్ని కాపలా కాస్తున్నాను అహం హి నగరీ లంకా. యీ లంకా పట్టణాన్ని నేనే. నన్ను కాదని యీ లంకలో అడుగిడలేవు అని దారుణంగా పలికింది.

వానర పుంగవుడూ, మేధావి హనుమ "నేను వానరాన్ని. ప్రాకార తోరణాలతో- వన, ఉపవనాలతో- స్వచ్ఛజలాల సరో వరాలతో- కానన సీమలతో- రమ్య హర్మ్యాలతో అలరారే లంకా

నగర సోయగాన్ని తనివితీర చూచి- నాదారిన నేపోతాను. అందు కింత కోపమెందుకు?" అన్నాడు.

ఓరీ వానరాధమా! నను గెలిచినగాని రావణు పాలితమైన లంకాపురిని చూడజాలవు" అంటూ లంకిణి చేయిచాపి ఒక్క చరుపు చరిచింది ఆంజనేయుని. ఆ దెబ్బకు సమీర కుమారుడు "ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః" పెద్దగా అరచి స్త్రీని చంపుట మహాపాపమని పిడికిలి బిగించి ఒక్క పోటు పొడి చాడు. ఆ పోటుకు కళ్ళు బయర్లు కమ్మగా లంకిణి నేలమీద పడి- ఒకనాటి గతాన్ని గుర్తుకు తెచ్చుకొని "వానరా! ఇక నీకు తిరుగులేదు. ఈ లంకా నగరంలో నీవు యథేచ్ఛగా తిరుగు. నా ఓటమి లంకకు చేటని ఎపుడో విధాత చెప్పనే చెప్పాడు. లంకలోని కేగి నీ కార్యం చక్కబరచుకో" అంటూ దారిచ్చింది.

ఈ సన్నివేశం గమనించినట్లయితే సంభాషణ సానుకూలం కాచటానికి, ఎదుటివారిని తన వశం చేసుకోవటానికి కావలసిన మాట నేర్పు తేటతెల్లం కాగలదు. లంకిణి ఆవేశపరురాలు కాగా ఆంజనేయుడును ఆవేశం పొందలేదు. ఆవేశపరుని దగ్గర తానూ ఆవేశం పొందిన కార్యభంగం తప్ప మరే లాభమూ లేదు. అది అగ్నిలో ఆజ్యం పోసినట్లే. ఓర్పుతో నేర్పుగా ఆవేశం చల్లార్చ ప్రయత్నం చేయాలి. అంతేకాక పొగడ్తలకు పొంగిపోవటం- ఎంత కాదనుకున్నా ప్రతి ప్రాణికి సహజం. కార్యసాధకులు ఎదుటి వారిని గొప్పగచేసి తమ పనులు పూర్తిచేసుకుంటారు. ఇదొక ఎత్తు గడ. లంకా నగరం ఎంత గొప్పదో! దేవ నగరం అమరావతిని తల దన్నే రమణీయత గలదని చెప్పగా విన్నాను. చూడాలనే కుతూ హలంతో వచ్చాను- అంటాడు నింపాదిగా ఆ మాటనేర్పును

చూచి వాల్మీకి ఆంజనేయుని 'మేధావి' అంటాడు. లౌకిక వ్యవహార లక్షణాలలో ఇది చాలా ప్రధానమైన లక్షణమన్న మాట. అందుకే ఒకచోట మారుతి ఇలా అంటాడు- 'ఐహికే సమనుప్రాప్తే మాం స్మరేత్ రామసేవకం' తననుండి ఏవం విధమైన లోకజ్ఞత అలవరచుకోవాలి సుమా! అన్నది సందేశం.

## శత్రుగృహం ఎలా ప్రవేశించాలి ?

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీం
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః.

అద్వారేణ మహాబాహుః ప్రాకారమభిపప్లువే
ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజ హితంకరః.

చక్రేఽథ పాదం సవ్యంచ శత్రూణాం స తు మూర్ధని
ప్రవిష్టః సత్త్వసంపన్నో నిశాయాం మారుతాత్మజః.

మారుతి అలా లంకిణిని జయించి అత్యుత్సాహంతో ముందుకు సాగి- 'ప్రయాణకాలే చ గృహప్రవేశే వివాహకాలేపి చ దక్షిణాం ఘ్రిం, కృత్వాగత శ్శత్రుపుర ప్రవేశే వామం నిదధ్యాత్ పురతో నృపాలం' ప్రయాణ కాలమందు గృహప్రవేశ సమయాన వివాహ కాలంలో ప్రథమంగా కుడి పాదం మోపాలి. శత్రు పట్టణ ప్రవేశ సమయంలోనైతే ముందుగా ఎడమ కాలు పెట్టవలె. అట్లు చేసిన శత్రువు శిరమునందు అడుగిడినట్లు అన్న రాజనీతిశాస్త్రమెరిగినవాడు గాన లంకానగరంలోనికి వాకిలినుండి కాక ప్రాకారం లోనికి ఎడమ పాదం పెట్టి డిగి, ఆ రాత్రివేళ కోటలూ, పేటలూ- ఇళ్ళూ, వాకిళ్ళూ- వనాలు, ఉపవనాలూ- పుట్టలూ,

చెట్లూ ఇలా నగరమంతా అణువణువూ శోధిస్తూ ఒక్క అంగుళం నేలయైనా వదలకుండా అర్ధరాత్రివేళదాకా రమణీయమై, మనోహరమై, చిత్ర విచిత్రమై, నేత్రోత్సవంగా, వీనులవిందుగా సాగే లలితకళా విలసితమైన ప్రదేశాలను గాంచి- అందెటను సీతను గానక తిరిగి తిరిగి రావణాంతఃపురం చేరాడు.

## బుద్ధి విశేషంతో భ్రాంతిని వీడాలి.

అంతఃపుర భవన సముదాయమంతా కలయచూస్తున్నాడు. అది ఎంత మనోహరమో అంత భయం కల్గిస్తున్నది. అరివీర భయంకరులైన రక్షక భటుల పర్యవేక్షణలో వుంది. ఆ ప్రాంతాన తిరుగుతున్న కత్తి అంచుమీద నడకన్న మాటే. ఒకవంక సింగారంగా శోభిల్లే యువతీ లలామలు, మరోవంక మత్తెక్కించే కలకూజితాలు- ఇంకోవంక సరోవరాలూ- వాటిచెంత ఫల పుష్పభరిత వృక్షాలతో ఉద్యానవనాలు- నవరసా లొలికిస్తూ ప్రకృతి శోభతో పరవశింప చేస్తున్నది. ఆయా ప్రదేశాలను మారుతి సీతకై కంట వత్తికుకొని ఎంతగ వెదకినా సీత జాడ తెలియరాలేదు.

ఇంతలో మారుతి చూపులు ఒక విశాల భవనంపై బడినై. అదే రావణ మందిరం. పుష్పకం అను పేరుగల విమాన భవనం. కనులు మిరుమిట్లు గొలుపు ఆ భవనాన అడుగిడి వెతకడం మొదలుపెట్టాడు. ఒకచోట హంసతూలికా తల్పంపై నిదురించే నల్లని పర్వతాకారుడు లంకేశ్వరుడు రావణుని చూచాడు. ఆశ్చర్యంగా తదేకంగా కొంత తడవు చూచాడు. అతని దృష్టి మరో పర్యంకంపై బడింది. ఆ తల్పంపై అతిలోక సుందరి పట్టమహిషి మండోదరి నిదురిస్తున్నది. ఉత్తమ స్త్రీ లక్షణాలను ఊహించి

అవన్నీ ఈమెలో కన్పడగా రాముని ఇల్లాలు సీత కాబోలు నను కున్నాడు. సంతోషించాడు. ఇంత కష్టం తానెవరికై పడుతు న్నాడో- ఆ మూర్తిని కనులముందు కాంచగనే ఉక్కిరి బిక్కిరైన ఆనందం కలిగింది. ఆ దృశ్యాన్ని ఆదికవి వాల్మీకి పరమ రమ ణీయంగా వాస్తవానికి అద్దం పట్టినటుల వర్ణించాడు.

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననంద చిక్రీడ జగౌ జగామ
స్తంభానరోహన్ నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం.

తన వాలాన్ని నేలపై కొట్టాడు. ముద్దు పెట్టుకున్నాడు. ఆ స్తంభం మీదనుండి యీ స్తంభం మీదకు దూకాడు. గంతులు వేశాడు. ఆనందంతో కోతి స్వభావాన్ని చూపిస్తూ ప్రవర్తించాడు.

ఇదొక భ్రాంతి కొన్ని కొన్ని సమయాలలో- వారెంతవార యినా భ్రాంతికి లోనవ్వటం సహజం. ఐతే సామాన్యులు యీ భ్రమకు లోనై అధఃపాతాళమున కంటుకుపోవుట సర్వసాధారణం కాబోదు. ఆంజనేయుడు మరుక్షణం మతిమంతుడై ఆలోచనలో పడి పొరబాటును గమనించి- నేనెంత పొరపడ్డాను. కాంతుని వీడి సీత పరగృహంలో, పరుని సమక్షంలో హాయిగా అదమరచి నిదురించునా! ఆభరణములను తాల్చునా! అన్నపానీయములు నారగించునా! ఎంతటి భ్రమకు లోనయ్యాను. ఈమె సీత కాదు, మరెవరోనై యుండవలె అని ఖిన్నుడై మరల కర్తవ్యోన్ముఖుడయి నాడు. ఇటువంటి సమయాలలో సమయజ్ఞత, ఆలోచనా పాటవం కలిగి ఉండాలి.

## చిత్త చాంచల్యం పనికిరాదు

శయన మందిరం వీడి పాకశాల చేరాడు. పాచకులు అనేక రకాలైన జంతు మాంసాలను తరిగి, పలు వంటకాలు చేయుటంలో తలమున్కలయి ఉన్నారు. ఆ పాకశాల ఎంత అందంగా చూడ ముచ్చటగా ఉందోకదా! అనుకుంటూ సీత కానమి ముందుకు సాగాడు. అచట కొందరు స్త్రీలు నగ్నంగా, అర్ధ నగ్నంగా మైమరచి నిద్రపోతున్న తీరు 'యతి విటుడు గాకపోవునే మదీయ శృంగార కావ్య వర్ణనా శర్ణనమున' అన్న సంతుపాలవాని శపథం గుర్తుకు తెచ్చేటట్లున్నది. ఆ సందర్భంలో ఎంతటివానికైనా కామ వికారం కలుగకపోదుగాని పవన తనయుడు పశ్చాత్తప్తుడై పోరానిచోట్లకు పోవలసి వస్తున్నది. చూడరాని దృశ్యాలు చూస్తున్నాను. పర స్త్రీని చూడడమే పాపం అన్నపుడు యీ స్థితిలో చూడటం మరెంత పాప హేతువగునో కదా! లేడిని లేళ్ళ గుంపులోనే వెదకాలి కదా. స్త్రీని స్త్రీలలో వెదకడంలో తప్పేముంది. ఐనా నా మనసున ఏ వికార భావాలూ కలగడం లేదు అని తనను తాను పరిశీలించుకున్నాడు.

"న హి మే మనసః కించిత్ న వైకృత్య ముపపద్యతే"

ఇచట మనకు కనిపించే విషయం ప్రధానంగా మనస్సు యొక్క ప్రాధాన్యత. ఏ సమయంలోనైనా సరే మనస్సును నిశ్చలంగా ఉంచాలి. విషయం మీదనే మనస్సు కేంద్రీకరించాలి. పరుగులు తీసే మనస్సునకు కళ్ళెం వేయాలి. మనస్సును సముద్రంతో పోల్చారు అనుభవజ్ఞులు సముద్ర తీరం అలలతో అల్ల కల్లోలంగా ఉన్నా సముద్ర మధ్యం మాత్రం ఏకొంచెం కదలికా లేక నిశ్చలంగా ఉంటుంది అలా సముద్ర మధ్యమువోలె

నిండుగా, గంభీరంగా ఏకాగ్రత కలిగి ఉండాలి. అందుకే కాళి దాసు 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అంటాడు. వికార భావాలేర్పడే సమయాలలో సైతం ఎవరి హృదయం చంచలం కాదో వారే ధీరులు. ఇదే మానవ లక్షణం కావాలి. కొంతమంది అంతరంగాలలో అపరాధాలు చేసి మంచి వారిలా పైకి కనిపిస్తారు. వారిని వేమన 'మేడిపళ్ళ'తో పోలుస్తాడు. చిత్త చాంచల్యం పనికిరాదు.

ఆనాటి ఆంజనేయుని అనుభవం యీనాటి సమాజంలో అడుగడుగునా తారసపడుతుంది. ముఖ్యంగా సినిమాలు- టి.వి.ల ప్రభావం వలన యువత పెడదారులు తొక్కుతున్నది. ప్రలో భాలు, పలు ఆకర్షణలు మనస్సుమీద దెబ్బ తీసే ప్రమాదం పొంచి ఉంది. నిగ్రహశక్తి అవసరం.

పైగా శరీరంతో చేసింది తప్పుకాదు. మనస్సుతో చేసిందే తప్పు అంటారు. "ఏనైవా లింగితే కాంతా తేనై వాలింగితా సుతా" ఈ శరీరంతో కాంతాలింగనం, సుతాలింగనం ఐతే మనస్సున కలిగే భావాల తీరు వేరుకదా! కాబట్టి మనశ్చాంచల్యం కలగ నంతవరకు ఏ దృశ్యం వీక్షించినాసరే మనకేమీ అంటదు. నిగ్ర హం కోల్పోయిననాడు అతని జీవితం త్రిశంకు స్వర్గమే.

హనుమంతునివలె ప్రతివారికి తాను చేసే పనిలో- మాటాడే తీరులో- అంటే కట్టులో- బొట్టులో- మాటలో- మంతిలో- సర్వే సర్వత్ర ఆత్మ పరిశీలన అవసరం తన మనస్సుకు తాను జవాబు చెప్పుకోవాలి.

ఆత్మకు ఆత్మయే చుట్టం, మిత్రుడు, శత్రువూను. ఆత్మతో

ఆలోచించి మంచి సలహాల నందుకోవాలి. అతడే సభూజంలో సత్పౌరుడుగా రాణిస్తాడు.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" మనస్సే బంధ మోక్షాలకు కారణం వ్యామోహాలకు, ప్రలోభాలకు చోటీయరాదు హృదయంలో. కాబట్టి మనస్సును పవిత్రముగ నుంచుట నలవరచుకొమ్మని యీ సన్నివేశం మనకు తెలియ చేస్తుంది.

## నిరాశ నిర్వేదానికి మూలం-
## ఆత్మహత్య మహా దోషం

ఆంజనేయుడు ఇలా లంకా నగరమంతా- గజశాలలు, పాక శాలలు, పానశాలలు, వనాలు, ఉపవనాలు, సరోవరాలు, లతా గృహాలు, భవనాలు- మొదలైనవన్నీ తిరిగి వెతికాడు. ఎందునా సీత జాడేమాత్రము తెలియరాలేదు. అన్ని ప్రదేశాలూ చూచెను. తన ప్రయత్నం అంతా వ్యర్థమైంది. అసలు జానకి జీవించి ఉన్నదో లేదో! జీవించి ఉంటే ఏదో ఒకచోట కనిపించి ఉండేది కదా! పంజరాన చిలుకనువలె తనను బంధించిన కారణంగా రామ లక్ష్మణులను తలచుకుంటూ కుమిలి కుమిలి కృశించిందో!! లేక నరమాంస భక్షకులు రాక్షసులు తినివేశారో !!! లేక రావణుడు తెచ్చువేళ సంద్రాన పడిపోయిందో! ఏమో!! ఏమి జరిగినదో!!!

ప్రస్తుతం కింక ర్తవ్య ? నూరు యోజనాల సముద్రాన్ని దాటి లంకంతా వెతికి సీతను కానక తిరిగి వెళితే- తానేం సాధించినట్లు ? అందరిలో నన్ను గొప్పగ చేసి పంపిన జాంబవంతుని ముఖం ఎలా చూడగలను? అంగదుడు నన్ను పరిహసించకుం

డునా? అందరిలో ఇక తల యెత్తుకుని ఎలా తిరగగలను? సుగ్రీవుడు నాపై కార్యభార ముంచినపుడు- రాముడు అంగుళీయక మిచ్చి "నీవే అందుకు తగినవాడవన్న" వారి నమ్మకాన్ని వమ్ము చేసితినే- గడువు మీరిన తదుపరి సుగ్రీవుడు నన్ను దండింప కుండునా!

సీతను చూడలేదన్న వార్త విన్న రాముడుండునా! రాముని వీడి లక్ష్మణుడు నిలుచునా! సుగ్రీవుడును, అంగదుడును ఇలా వానరజాతి అంతయు అంతరించునే. ఇంతటి దారుణం నావలననే గదా జరిగేది.

అసలు పోకుండిన- ప్రాయోపవేశ మిచట నేనయిన అందరూ జీవింతురు గదా! అని నిర్వేదముతో నిరాసక్తతకు లోనై- అంజనేయుడు క్షణకాలం చింతాక్రాంతుడై వెనువెంటనే నూతనోత్సాహాన్ని తెచ్చుకుని "ఛీ! ఆత్మహత్య ఎంతటి పాపహేతువు. మనస్సులో శోకానికి తావీయవచ్చునా! ప్రాణత్యాగం సమస్యను మరింత జటిలపరచునేగాని పరిష్కరించునా? ప్రాణమలున్న సత్ఫలితా లందకపోవు అన్నిటికి మూలం ఉత్సాహం. ఉత్సాహవంతుని సుఖాలు వరించి వస్తయ్. ఉత్సాహవంతుడే సమస్త కోర్కెల నందగలడు" అని భావించి అంతఃపుర ప్రాకారం మీద నిలబడి ఎదురుగా చూచాడు. అశోక వనం కనిపించింది. ఇది తానింతకు పూర్వం చూడనిది. సీతకై 'ఈ వనం వెతుకుదాం' అనుకుంటూ వనం లోనికి ప్రవేశించాడు.

యుగాలు మారినా- తరాలు దొర్లినా రామాయణ కాలంనాటి సాంఘిక జీవన స్థితిగతులు నేటి సమాజానికి దర్పణాలుగా నిలవడం ఆశ్చర్యకరం. రామాయణాన్ని అనుదినం మననం చేసి అందలి జ్ఞాన విజ్ఞానాలను "నీటికొలది తామర సుమ్మీ" అన్నట్లు

అగాధ జలనిధిలోని అనంత రత్నాలను అందగలిగినంతవరకు అందుకుని జీవన ధన్యత నందుటకు ప్రయత్నించవలెను.

చూడండి. ఈ సన్నివేశంలో పవన తనయుడు సీతాన్వేషణ నిరంతర పరిశ్రమ, కఠోర దీక్ష, నిస్వార్థ సేవాభావం, నిర్మల హృదయం, ఏకాగ్ర చిత్తంతో చేసినా ఫలితం శూన్యమైంది. ఎంతటివానికైనా ఆ పరిస్థితులలో జీవితం మీదనే విరక్తి కలుగుతుంది. మరి అటువంటప్పుడు కలిగే మనోవికారం ఆత్మహత్య. ఆత్మహత్య మహా దోషం. ఆ భావం అసలు మనసులోకి రానీయరాదు. వచ్చిందా వివేకం లోపిస్తుంది సామాన్యులకు.

ఇది యీనాడు మనం నిత్యం చూస్తున్నదే. ఈనాటి సమాజం చూస్తే ఏమున్నది గర్వకారణం? ఏ పేపరు చూచినా ప్రేమ విఫలమైతే- ఆత్మహత్య. పెద్దలు బుద్ధి చెబితే-ఆత్మహత్య పరీక్షా ఫలితాలలో తన నెంబరు కనబడకపోతే- ఆత్మహత్యే! ఇంటిలోని వారు తన మాట కాదంటే- ఆత్మహత్య. ఇలా ప్రతి సమస్యకు తేలిక మార్గం ఆత్మహత్యే. అంటే అన్నింటికీ పరిష్కార మార్గం ఆత్మహత్యేనన్న మాట. ఇదీ నేటి సమాజ పరిస్థితి.

## మనసుంటే మార్గం ఉంటుంది

ఈ ఆలోచన వచ్చిన వెంటనే ఒక్కక్షణం మనస్సును వశము నందుంచుకుని వివేకంతో కూడిన బుద్ధితో ఆలోచిస్తే తమ సమస్యకు ఒక మార్గం దొరకుతుంది. మనసుంటే మార్గం ఉంటుందంటారు కదా! అపజయాలు విజయానికి సోపానాలు. తన ప్రయత్నంలో ఎక్కడో లోపం జరిగిఉంటుంది. ఆ లోపం గమనించి ప్రయత్నిస్తే ఫలితం లభించకపోదు. నైరాశ్యం పనికి

రాదు. శరీరాన్ని వీడి సాధించేదేముంటుంది? శరీరంతోనే సర్వం సానుకూలం చేసుకోవాలి. ఆశించిన ఫలితం పొందేవరకు కృత నిశ్చయంతో ఉత్సాహపూర్వక ప్రయత్నం చేస్తూంటుంటే- అభీష్ట వస్తు సందర్శన ప్రాప్తి కాగలదు.

బలంగా బంతి నేలకేసి కొడితే- అది అంతే రెట్టించిన వేగంతో పైకి ఎలా ఎగురునో అలాగే విఘ్నాలెంత కలిగినా జితేంద్రియుడై ధైర్యంతో, వివేకంతో, పవిత్రశీలంతో ప్రయత్నించాలి. నిరాశతో విజయం చేకూరదనీ, విశ్వాసంతో- ఉత్సాహంతో కర్తవ్యోన్ముఖుడవ్వాలి. ఆవేశం అణచుకుని ఆత్మస్థైర్యంతో దైవాన్ని నమ్మి కార్యసాధకు డవ్వాలి. ఎందుకంటే ఒక్కొసారి గొప్పవారు సైతం దేవుని మరచి శక్తిహీనులౌతుంటారు. పురుష ప్రయత్నానికి దైవం తోడు కావాలి "షడ్భిర్మనుష్య యత్నేన సప్తమం దైవచింతనం" అపుడే "మబ్బును వీడిన చంద్రుడివలె" సమస్యల నుండి బయటపడ గలుగుతాడు.

అంతేగాని తొందరపడి పిరికితనంతో కింకర్తవ్యతామూఢుడై ఆత్మహత్యా నిర్ణయం చేయరాదు.తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని- అంటే తను కన్నవారిని, తనను కన్నవారిని గాలికి వదిలేసి అన్యాయం చేయరాదు. జీవన సమస్యలతో రాజీలేని పోరాటాన్ని సాగించాలి. ఎదురెంతగ యీదినా- అలసి సొలసినా తన లక్ష్యాన్ని వీడరాదు. గమ్యం చేరాలి. ఇదే ఇచట మారుతి మనకిచ్చిన మహత్తర సందేశం.

## ప్రయత్నిస్తే ఫలితం ఉండకపోదు

ఆంజనేయునికి ఆ వనం చూస్తుంటే ఎందుకో తనువు ఆనంద తరంగాల తేలియాడుతున్నది. ప్రకృతి సౌందర్యంతో ఆ

వనం పరవశింప చేస్తున్నది. నందనవనంలా ఫల పుష్పభరిత వృక్షతతులతో మనోహరంగా ఉంది. ఇంతవరకు తాను పొందిన నిర్వేదం పటాపంచలైంది. ఒక్కసారి శ్రీరామచంద్రునివైపు మనసు పోయింది. ఏకాగ్రచిత్తంతో సీతారామ లక్ష్మణులకు నమస్కరించాడు. రుద్ర, ఇంద్ర, యమ, వాయుదేవులకు- చంద్ర, సూర్యులకు- మరుద్గణాలకు- మనసారా నమోవాకము లర్పించి చుట్టూ కలయచూడగా మైమరపించే ఆ పూల వాసనల నాఘ్రాణిస్తూ చిన్న రూపంతో చెట్ల పైకి ఎగురుతూ- తిరుగుతుండగా-

మనోహర చైత్య ప్రాసాదం అల్లంత దూరాన కానవచ్చింది. ఆ రమ్య హర్మ్య ప్రాంత సమీపాన- శింశుపా వృక్షచ్ఛాయలో "శుక్ల ప్రతిపత్ చంద్రరేఖ వోలె" "ఉపవాస కృశాం దీనాం" మాటిమాటికి వేడి నిట్టూర్పులు విడుచుచు, దట్టమైన పొగతో కప్పబడిన అగ్నిశిఖవలె నుండి మాసిన చీరతో, రాక్షసీజన పరివృతయైన సీతను చూచాడు. ఆమె క్రూర మృగాల మధ్య లేడిలా ఉంది. ఆనాడు తమకు దొరికిన వస్త్రఖండ ఆభరణాలు- ఈమె తాల్చిన వస్త్రాభరణాలు ఒక్కటిగ ఉండుటను బట్టి- రాముడు వర్ణించిన ఆభరణాల ధారణ తీరునుబట్టి- ఈమెయే రాముని ఇల్లాలు అని నిర్ణయించుకున్నాడు. చెట్టుకొమ్మల మాటున దాగి సీతను చూస్తుంటే హనుమంతునంతటి జితేంద్రియుని హృదయం ద్రవించి కనులు దుఃఖాశ్రువులతో నిండినై.

"యది సీతాపి దుఃఖార్తా కాలో హి దురతి క్రమః."

సీత వంటి మహాసాధ్వికా ఇంతటి కష్టము దాపురించుట- ఆహా! కాలమెంత దురతిక్రమమో కదా !! విధి దాటరానిది. ఎంత వారైనా విధికి బానిసలే.

తుల్య శీల వయో వృత్తాం తుల్యాభిజన లక్షణాం
రాఘవోర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా.

శీల వయోవర్తన అభిజాత్యాది లక్షణాలలో ఇరువురూ సమానులే. సీతారాములు ఈడూ జోడైనవారు. వీరిది అనుకూల దాంపత్యం. ముజ్జగాల రాజ్య రమను జనకజ సీతను పోల్చి చూచిన యీమె ముందు త్రైలోక్య రాజ్యలక్ష్మియు దిగదుడుపే.

కష్టసుఖాల కతీతుడు, తేజస్వీ, పౌరుషవంతుడు, సమయోచిత కర్తవ్య ధురీణుడు, అంజనా సుతుడు- ముందు వెనుకల గురించి ఆలోచిస్తున్నాడు ఇలా. చేయవలసినదెంతో ముందుంది. జానకిని చూచాను. నేనిపుడేమి చేయుట యుక్తం? ఈమెతో సంభాషించి ఓదార్చి వెళ్ళుట భావ్యమా! లేక రాముని చేరి సీతాదేవిని చూచానని చెప్పుట ధర్మమా? అసహాయురాలు, దీనురాలు ఐన సీతను ఊరడించి వెళ్ళుటయే న్యాయము. ఎందుకంటే- రాముడు- సీతను చూచాను అనగనే ఎలావుంది? నాతో ఏమని చెప్పమంది? అని అడిగితే రాఘవునికి నేనేం చెప్పగలను? కాబట్టి మాటాడి వెళ్ళుటయే యుక్తం మరి అలాగయిన రాక్షసులు కామరూప ధరులగుట- ఇప్పటికే అనేక రూపాలతో ఆమెను అదిరించి, బెదిరించి యుందురు. అట్టి స్థితిలో యీమె నన్ను గుర్తించునా!

ప్రాణ త్యాగశ్చ వైదేహ్యా భవేదనభిభాషణే
ఏష దోషో మహాన్హి స్యాత్ మమ సీతాభిభాషణే.

అని ఆలోచించి చివరకు సీతాదేవిని ఎలాగైనా ఊరడించ నిశ్చయించుకున్నాడు.

తెలతెలవారుతున్నది. రావణాంతఃపురం నుండి వేద ఘోష

వినిపిస్తున్నది. మేల్కాంచిన రావణుడు సపరివారంగా వచ్చి సీతతో- కారడవులలో తిరిగే రామునిమీద నుండి తనవైపుకు మనసు మరల్చుకొమ్మని, కాదను నిను ముట్టనని, రుచులు, రుచులుగా వండించుకుని విందారగిస్తానని, నీవిక రాముని చేరుట కలలోని వార్త అని వివిధరీతుల బెదిరించి- భయపెట్టి ఇక నీకు రెండు నెలలే గడువని, ఆలోచించుకొమ్మని చెప్పి-

సీతను కాపలా కాచే రాక్షస స్త్రీలతో- "మీరీమె మనసు మార్చండి' అని హెచ్చరికలు చేసి వెళ్ళాడు.

తతస్సీతాం ఉపాగమ్య రాక్షస్యో వికృతాననాః
పరుషం పరుషానార్య ఊచుస్తాం వాక్యమప్రియం.

రావణుడు అలా వెళ్ళాడో లేదో వెంటనే చుట్టుముట్టారు సీతాదేవిని రాక్షస స్త్రీలు. తమ స్వామి ఆదేశానుసారం వివిధ రీతుల భయపెట్టసాగారు. వారి మాటలు సీతాదేవికి కంటక ప్రాయమై, తనను మాటలతో హింసించవద్దని, కావలిస్తే చంపి తినండని ఎంతగ బ్రతిమాలినా ఆ రక్కసి మూక వినిపించుకో దయ్యె. వారిని తప్పించుకుని అంజనేయుడున్న శింశుపా వృక్ష చ్ఛాయ నాశ్రయించింది ఆ వికార రూపసులు అక్కడకూ చేరి కర్ణకఠోరమైన వాగ్బాణాలతో వేధింపసాగారు. వారి మాటలు విన లేక తన విధికి ఎంతగనో విలపించింది. రామ లక్ష్మణులను, కౌసల్యా సుమిత్రలను- పేరుపేరునా తలచుకుని, అందరూ ఉండి కూడా లేనిదాననై నశించుచున్నాననుకుంది.

ప్రసక్తా ప్రశముఖీత్యేవం బ్రువంతీ జనకాత్మజా
అధోముఖ ముఖీ బాలా విలప్తుముపచక్రమే.

తీరమే కానరాని "అగాధ నదిపంప్రదాన త్రోయబడినదాని" వలె, కుమిలి కుమిలి దుఃఖించి, ఇంకను 'ఉన్మత్తురాలి వలె' విలపించింది.

ఇదంతా చెట్టుకొమ్మల ఆకుల సందులనుండి పవన తనయుడు చూచుచునే ఉండెను.

నిద్రపోతున్న త్రిజట అను రక్కసి మేల్కాంచి, సీతను భయపెడుతున్న రాక్షస గణాన్ని వారించి, తాను కన్నకలలోని దృశ్యాలను వివరించి చెప్పింది. ఆ స్వప్న వృత్తాంతం వింటూనే నిద్రలోకి జారుతున్నారు రాక్షస స్త్రీలు.

## వాక్య విశారదుడు

ఇక తనకు మరణమె శరణమని, ఆ క్రూర రాక్షసాధముని చేతిలో మడియుట కంటె ప్రాణత్యాగమె మంచిదని భావించి తన జడను ఉరిత్రాడుగ చేసుకుని ప్రాణోత్క్రమణమునకై ప్రయత్నించుచున్నది.

తాను సీతతో సంభాషించుటకు ఇదే తగిన సమయమని, ఏ కొంచెం ఆలస్యం చేసినా ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని-తగిన సమయానికై వేచియున్న మారుతి ఇటులాలోచించసాగాడు. నేనిపుడీమెతో ఎలా మాటలాడవలె ? ఈమె నేవిధముగ ఊరడించవలె? ఆత్మహత్యా ప్రయత్నానికి సిద్ధపడిన సీతను విరమింపచేయాలి. లేదేని రామ లక్ష్మణులు వచ్చి ఇచట చేసేదేముంది ? సమయం మించిపోవుతున్నది. కాలయాపన చేయరాదు. సరే. నేను వానరుడను. ఈ రూపాన యీమెతో మాటలాడతగదు. పోనీ సంస్కృతమున మాటలాడుదమన్న- ద్విజుడైన రావణుని

మాయా రూపముగా భావించునేమో! కనుక 'అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్యమర్థవత్' మనుష్య భాషలోనే సంభాషించుట తగియున్నది. నా వేషభాషల ననుమానించి యీమె పెద్దగ అరచినచో ఎచటెచటనో నున్న రాక్షసులందరును ఒక్కటై నా మీదకు వచ్చిన ఆత్మరక్షణార్థం పోరు సాగించక తప్పదు. జయాపజయాలు దైవాధీనాలు అన్నమాట అటుంచి వచ్చిన పని జటిలమగును. దూతలు దేశకాల పాత్రానుగుణంగా ప్రవర్తించుట న్యాయం. కాదేని పరిస్థితి మరోలా ఉండవచ్చు. తొందరపడి ఉద్రేకానికి లోనైతే- అదే అన్ని అనర్థాలకూ మూలం అవుతుంది అనుకుంటూ—

మృదుమధురంగా మంగళప్రదమూ, ధర్మసమ్మతమూ నైనరీతిగా- సీతా నిర్వేదము తొలగునట్లు, ఆత్మత్యాగము నుండి మరలునటుల రామకథను—

రాజా దశరథో నామ రథకుంజర వాజిమాన్
పుణ్యశీలో మహాకీర్తిః ఋజురాశీన్మహా యశాః.

దశరథ మహారాజు అయోధ్యా నగరాన్ని పరిపాలిస్తున్నాడు. పరాక్రమశాలీ, ధర్మతత్పరుడు. అతని పెద్దకొడుకు రాముడు. సదాచార పరాయణుడు, మృదుభాషి. జీవ కారుణ్యము కలవాడు. సత్యవాక్పాలకుడు. తండ్రి యానతి తలదాలిచి భార్య సీత, సోదరుడు లక్ష్మణుడు వెంటరాగా దండకాటవికి ఏతెంచినాడు. ముని జనులను హింసించే ఖర దూషణాదులను వధించాడు. ఇది తెలిసిన రావణుడు మాయా లేడిని కల్పించి రామ, లక్ష్మణులను దూరం చేసి ఒంటరిగానున్న రామపత్ని సీతను మాయా రూపంలో అపహరించాడు. భార్యాన్వేషణలో కిష్కింధ చేరిన రామునికి;

వానర రాజు సుగ్రీవునికి సఖ్యమేర్పడింది. సుగ్రీవుని అన్న వాలి. రాముడు వాలిని సంహరించి సుగ్రీవుని రాజుగా చేశాడు. సుగ్రీవా దేశానుసారం వేలకొలది వానర వీరులు సీతను వెదకుటకై అన్ని దిక్కులకు బయలుదేరి వెళ్ళారు. వారిలో నేనొకడను. సంపాతి మాటల ననుసరించి నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి సీతాన్వేషణ చేయుచు లంక చేరాను.

**యథా రూపాం యథా వర్ణాం యథా లక్ష్మీం చ నిశ్చితాం**
**అశ్రౌషం రాఘవస్యాహం సేయ మాసాదితా మయా**
**విరరామైవ ముక్త్వాసౌవాచం వానర పుంగవః.**

ఇపుడిచట రాముడు వర్ణించి చెప్పిన రూపురేఖలున్న సీతా దేవిని నేను దర్శించుచున్నాను అని పలికి మౌనం వహించాడు.

తలవని తలంపుగా యీ లంకలో ఇంతగా చెవులకింపుగా నిజమైనా, కలయైనా నిరాశలో ఒకటే అనుటను తలక్రిందులు చేస్తూ రామకథను వినిపించిన దెవరా అని ఆనందముప్పొంగ చేతిలోని కేశపాశాన్ని విడిచి విప్పారిన కనుదోయితో తలపైకెత్తి చెట్టు పైకి పరికించి చూచింది జానకి.

తననే చూచుచున్న సీత మనసు నెరిగినవాడై పవన తనయుడు మెల్లగ పైనుండి దిగివచ్చి వినయ విధేయత లుట్టిపడ కేల్మోడ్చి-

అమ్మా! నీవెవరవు? ఈ చెట్టు నీడన శోకమూర్తివై నిలబడి ఎందుకిలా డిగాలుగా నున్నావు ? అంత కష్టం నీకేమిటమ్మా ? సురాసుర నాగ గంధర్వ యక్ష కిన్నరాంగనవై యుందువా ? చంద్రుని వీడిన రోహిణివా? కోప తాపాలతో భర్తను వీడి వచ్చితివా? వశిష్ఠునిపై అలిగి వచ్చిన అరుంధతివా! చూడగా నీవు మానవ

కాంతవోలె కన్పట్టుచున్నావు ? రాచకన్నియ వనుకొందును. జన స్థానమున రావణు డపహరించిన సీతవు కావుకదా! అదే నిజమైన 'త్వమసి భద్రం తే' నీకు శుభమగు గాక!

ఇది పవన కుమారుడు సీతను గాంచి భాషించ మొదలిడిన సన్నివేశం.

ఈ సన్నివేశంలో అంజనా నందనుడు చూపిన మాట నేర్పు, సంభాషణలోని ఎత్తుగడ, ముందుగా కార్యసాధన కాతడు చేసిన ఆలోచన- తక్షణ కర్తవ్య నిర్వహణ నిర్ణయము, ఓర్పు నేర్పులు- ఆంజనేయు నంతటి వాక్య విశారదునికే చెల్లును. సకల మాన వాళి తన బాటలో పయనించునటుల- అందించిన సందేశం శిర సావహింప తగినది.

పావని సీతను చూచుటతోనే- వచ్చిన పని పూర్తయినట్లు. జీవన సమస్యతో, నిరాశతో కొట్టుమిట్టాడుతున్న సీతకు- జీవితంపై ఆశను కల్పించాలి. రాముడు లంక చేరి రావణ సంహార మొన రించి సీతను గ్రహించులోపల ఏ పొరపాటు జరగకుండ ఆమెను ఊరడించాలి. అందుకామెకు తనపై నమ్మకము కలుగురీతిని సంభాషించాలి. అందుకామెకు తనపై నమ్మకము కలుగురీతిని సంభాషించాలి. ఇందుకు తగినరీతిగా, మాటలాడగల నేర్పుతో మాట్లాడి సఫలీకృతుడయ్యాడు. సమయానుకూలంగా మాట్లాడ టానికి చక్కని ఉదాహరణగా ఉంది యీ ప్రసంగ సన్నివేశం.

ఆమె ఎవరైనదీ తనకు తెలుసు. కాని నీవెవరవని, గంధర్వ కాంతవా ? నాగకన్యకవా! రోహిణివా! అరుంధతివా ! అంటూ చివరకు రాముని భార్యవు కాదుగదా! అంటాడు. సంభాషణలో ఇదొక నైపుణ్యం. ఆమె ఎవరో ఆమె నోటనే చెప్పించుట. ఇంతకు

ముందు జరిగిన సంగతులు తెలిసియు- అపుడే వచ్చినవానివలె పలుకరించుటలోనే వాక్య విశారదత్వ ముట్టిపడుతుంది.

నాకన్ని సంగతులు తెలుసు- అని ప్రారంభిస్తే ఆమె సిగ్గుపడవలసి వస్తుంది. ఎంత కష్టము లనుభవించుచున్నను- కొందరు చెప్పకొనుటకుగాని, ఓదార్పునకుగాని ఇష్టపడరు.

**ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రమౌషధ సంగమం**
**దానమానావ మానాని నవగోప్యాని సదానివై.**

ఆయువు, విత్తము, ఇంటిపోరు, మంత్రం, ఔషధ సేవ, సంగమం, దానం, అవమానం- ఈ తొమ్మిదింటినీ గోప్యంగా ఉంచాలంటుంది శాస్త్రం.

## కార్యసాధనకై తగ్గిన అల్పుండగునా?

శ్రవణ సుభగాలైన ఆ మాటలకు ఆనందాశ్చర్యాలతో తన వృత్తాంతం వివరించిజానకి- మీకూ రామలక్ష్మణులకు పరిచయం ఎట్లు కలిగిందన్న అనుమానం వెలిబుచ్చగా- ఆంజనేయుడు ఆమె సందేహాలను తీరుస్తూ- "అమ్మా! నేను రామదూతనై నిదగ్గరకు వచ్చాను." ఉన్నాడు లెప్ప రాఘవుడు. లక్ష్మణుడును కుశలమే. 'త్వాం చ కుశల మబ్రవీత్' నీ క్షేమం అడగమన్నారు. నాపై నీకు నమ్మకము కలుగుటకై- దేవీ! రామనామాంకిత అంగుళీయకాన్ని ఇచ్చారు. ఇదిగో చూడు తల్లీ! అని ఉంగరం యిాయగా తీసుకుని 'జానకీ ముదితా భవత్' సంతోషించింది. విశ్వాసం కలిగింది. "హనుమా! నాకున్న గడువు ఇక రెండు మాసములే" అని గద్గదకంఠయై పలికింది.

అమ్మా! నిన్ని స్థితిలో చూస్తుంటే నా గుండె తరుక్కుపోతున్నది. సందేహించకు తల్లీ!! నా వీపుపై కూర్చుంటే నిన్ను క్షణంలో రాముని దగ్గరకు చేరుస్తాను. "అస్మాద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠం అనిందతే" అవలీలగా శతయోజన విస్తీర్ణ సాగరం దాటి వచ్చాను. అనాయాసంగా తిరిగి వెళ్ళగలను. అంతేకాదు. రావణ సహితంగా లంకను పెళ్ళగించి మరీ తీసుకు వెళ్ళగలను. రాక్షసులు నన్ను వెంబడిస్తారని భయపడవలదు. నా గమన వేగాన్ని అందుకునే శక్తి వారికి లేదు".

ఆ మాటల కానందించినా జనక నందినికి అనుమానం మాత్రం వీడలేదు.

హనుమన్ దూరమధ్వానం కథం మాం ఓఢుమిచ్ఛసి
తదేవ ఖలుతే మన్యే కపిత్వం హరి యూథప.

హనుమా! అంగుష్ఠమాత్రమైన లేవే! నన్ను అంతదూరం ఎలా మోస్తావు. నీ మాటలు నీ కపిత్వాన్ని చూపుతున్నాయి.

సీతమ్మ మాటలు తనకు తక్కువతనాన్ని కలిగిస్తున్నాయి. ఇది ఒక అవమానం. అవమానకరం తన శక్తి నామెకు చూపదలచి "ఇంతవాడు ఇంతకు ఇంతై ఎంతో ఎత్తుకు ఎదుగుతూ- దివ్యకాంతుల నీనుచూ- మేరు పర్వతమంత ఎత్తు అయ్యాడు. వజ్ర దంష్ట్రలు- వజ్ర నఖాలు- వజ్ర దేహం- కనులు మిరుమిట్లు గొలుపు భీకర రూపంతో తనముందు నిలబడిన మారుతిని చూచి- ఆష్టలక్ష్మియుతునిగా భావించి-

తవ సత్త్వం బలంచైవ విజానామి మహా కపే
వాయోరివ గతించైవ తేజశ్చాగ్నేరివాద్భుతం.

హనుమా! నీ బలమూ, ధైర్యమూ ఎలాంటివో తెలుసుకున్నాను. గమనంలో వాయు సమానుడవు. తేజస్సులో అగ్ని సముడవు. సందేహించనక్కరలేదు. కాని నీవు నన్ను తీసుకువెళ్తుంటే- రాక్షస సేన వెంబడించిన వారినెలా ఎదుర్కొనగలవు. అందులో కొందరు నన్ను బంధించిన- ఇక నన్ను వధించుట తథ్యం. నీవు నన్ను తీసుకు వెళుతుంటే- దారిలో జారి పడ్డాననుకో- భీకర మకరాలయం లోని భయంకర జలచరాలు నన్ను కబళించును. దీనితో రామ కార్యం నెరవేరదు మరొక్కమాట- "న స్పృశామి శరీరం తు పుంసో వానర పుంగవ" నేను పర పురుషుని తాకను. మరి రావణుడు స్పృశించలేదా అంటావేమో! అప్పుడు నేను అసహాయురాలను. దీనురాలను బలాత్కరించగా నేనేమి చేయగలను అబలను. చాటుగా, పిరికితనంగా అలా తెచ్చాడు. అదేవిధంగా చాటుగా పారిపోవటం నాకూ, నీకూ, రామునకూ గౌరవప్రదం కాదు. బలపరాక్రమోపేతుడై రాముడు రావణుని వధించి నన్ను తీసుకుపోవుట న్యాయమార్గం.

తల్లీ! నీ మాటలు పతివ్రతా లక్షణాలకూ— స్త్రీ స్వభావానుగుణంగా ఉన్నాయి. రాముని వినా పర పురుషుని తాకనని పల్కుట నీకు చెల్లినదిగాని మరెవరు ఇట్టి మాటలు పలుకగలరు? స్వయముగా రాముడేతెంచి క్రూర రక్కసుల పీచమణచి నిన్ను తీసుకు వెళ్ళుటయే ధర్మ సమ్మతం. నేను వాయువేగ, మనోవేగాలతో వెళ్ళి రామ లక్ష్మణుల ముందు వాలతాను. అని హనుమంతుడు పల్కగా-

మరల జానకి సంశయగ్రస్తురాలైనది. "వానర సేనలో నీవలె బలశాలు లెంతమంది ఉండగలరు? వేళ్ళమీద లెక్కింపదగిన వారు ఒకరో ఇద్దరో ఉండియుందురు. అటువంటప్పుడు యీ

రాక్షస సేనావాహినిని జయించుట రామ లక్ష్మణులకు సాధ్య మగునా! అసలు లంకకు చేరగలరా!" అని చింతించి వగచే ఆమె మనోగతాన్ని గమనించి పావని—

"అమ్మా! రామ లక్ష్మణులను నా వీపుపై నెక్కించుకు రాగలను. ఇక వానర, భల్లూక వీరుల సాటిరాగల వారెవరూ యీ లంకలో లేరు. వానర సేనలో నాతో సమానులూ, నన్ను మించిన పరాక్రమశాలురే అందరూ. నాకన్న తక్కువవారు లేనేలేరు. నా వంటివారే యీ సముద్రాన్ని దాటిరాగా, నాకంటె బలశాలుర గురించి ఇక వేరుగ చెప్పవలెనా! సామాన్యంగా దూత కృత్యానికి అల్పులను మాత్రమే పంపుతారు. బలశాలురను పంపరు. కనుక శంకారహితవు కమ్ము. స్వస్థత పొందుము. "క్షీణ దుఃఖ ఫలా హ్యసి" "త్వరలోనె దుఃఖ ముపశమించును గాక!"

హనుమంతుని ధైర్య వచనాల నాలకించి జానకి సంతో షంగా "వాయునందనా! నాకు ఆనందం కలిగే మాటలు విని పించినావు. నిన్ను చూచుటతోనే గ్రీష్మ తాపానికి వాడిపోయి వాన జల్లుకు కలకలలాడే పంట చేనులా- ఆనందంతో నా మనస్సునకు కొంత ఊరట కలిగింది" అన్నది.

ఈ సన్నివేశం ఆలోచనాత్మకంగా చూడవలసినది. జానకి అనుమానాలు, వానిని మారుతి తీర్చిన విధానాలు నేటి సమాజా నికి క్షణక్షణావసరాలు.

నిర్వేదంలో, నిస్సహాయతలో ఉన్నవారినెలా ఓదార్చాలి. వారితో మాట్లాడే విధానం గాయపడినవారి గాయాన్ని మాన్పే సంభాషణా రీతి, మాటల సందర్భంలో తనకేదయినా బాధాకర విషయం ఎదుటివారినుండి ఎదురైతే- వారు నొచ్చుకోనిరీతిగా

వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడం- కార్యసాధన కవసరమనుకుంటే- సంశయగ్రస్తమయినవారికి ధైర్యోత్సాహాలు కలగడం కోసం- విన యంగా ప్రవర్తించడం- ఎదుటివారి మాటలలోని మంచితనాన్ని గౌరవించడం- కార్య సాఫల్యత కోసం- తనను మించినవారు లేరని తెలిసినా- పౌరుష ప్రదర్శన కాక వినయ గుణాన్ని నయంగా చూపుట, అణకువతో ఆత్మాభిమానం కలిగి ఉంటూనే- తానాశించిన ప్రయోజనాన్ని పొందటానికి తనను తాను తక్కువ చేసుకున్నా నష్టం లేదన్నమాట. అంతేకాని ఎదిరిమాటల నెదిరించి నేనంత గొప్పవాణ్ణి- ఇంత గొప్పవాణ్ణి సరిలేరు నాకెవ్వరూ అని మొదలిడితే కార్యభంగం అని తెలిసి ప్రవర్తించాలి. ఇన్ని విధాల ఆలోచనలతో సమయ సందర్భము లెరిగి నడచుకోవాలి సుమా అన్న సందేశాన్ని అందించాడు మారుతాత్మజుడు. మన నీతికారులు కూడా-

చేతనగువాడు కార్యము
కై తగ్గును వంగు గాక యుల్బ్రండగునా!
యేతము చడి తా వంగును
బాతాళము నీరు దెచ్చి బయులం జల్లున్.

"ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబు బొనరించును స
జ్జను లైనవారి కడకువ
యును వినయము నివియు తెచ్చు" నన్నటుల మారుతి

యీ సందర్భమున చూపిన వినయం సమాజంలో సర్వులూ అల వరచుకోవలసిన విశిష్ట లక్షణం.

9 )

సీతామాతకు ధైర్యం చెప్పి- ఆనవాలుగా ఇచ్చిన శిరోరత్నాన్ని తీసుకుని- అనాడు అరణ్యవాసంలో జరిగిన కాకాసుర వృత్తాంతంతోపాటు ఆమె సందేశాన్ని విని తిరుగుముఖం పట్టబోతున్న పావనితో "మారుతీ!నీకు మరోసారి నా దీనావస్థను చెబుతున్నాను విను కార్యసాధన జరిగే తీరున రామ ప్రభువును ప్రోత్సహించు. నీవు చక్కగా యోజించి ప్రయత్నిస్తే నా కష్ట పరంపరలు తొలగుతాయి!" అనగనే పవన తనయుడు 'తథేతి' అన్నాడు. అంతలోనే కన్నీరు విడుస్తూ సీత "హనుమా! అందరినీ పేరుపేరునా అడిగానని చెప్పు. నా బొందిలో ప్రాణాలుడుగక పూర్వమే రాముడు నన్ను చూచేటట్లు చేయవలసినది. నీవు పుణ్య వంతుడవు. నీ మాటలు విని రామప్రభువు స్పందించి వేగమే వచ్చి నన్ను తీసుకువెళ్ళునట్లు చేయి. నా మాటలనెలా చెబితే నా నాథుడు ఉత్తేజితుడై ఎంత త్వరగా తీసుకు వెళ్ళగలడో- అలా చెప్పు అంటుంది.

అంటే మాట విలువ అమోఘం అన్నమాట. మాటకున్న శక్తిని గూర్చి మహాభారతం ఇలా అంటుంది.

అరిది విలుకాని యుజ్జ్వల శరమొక్కని నొంచు
దప్పి చనినం జను, నేర్పరియైన వాని నీతిస్ఫురణము, పగరాజు
నతని భూమిం జెరచున్.

విలుకాని బాణం గురితప్పనిచో ఒక్కని నొంచును. గురి తప్పిన వ్యర్థమగును కాని నీతిమంతుని మాట గురితప్పుట అన్నదే లేదు. మాట అంత శక్తివంతమైన దన్నమాట. ప్రమోదం, ప్రళయం రెంటిని కలిగించగలదు.

## ఆంజనేయుడు - ఉత్తమ దూత

దూతగ వచ్చినవాడు పంపినవాని సందేశాన్ని పూసగుచ్చినట్లు చెప్పవలె గాని తన అభిప్రాయాలను వానికి జత చేయరాదు. సహజంగా "అడిగో పులి అంటే ఇడిగో తోక" అన్నట్లుగ మాట్లాడే మనస్తత్వం కలవారే ఎక్కువ. ఆ విధానం పనికిరానిది. వాస్తవిక దృక్పథం ఎంతో అవసరం మాట విలువ తెలిసి మసలుకోవాలి. మంచికి ఉపయోగించాలి. అది పుణ్య ఫలితాన్నిస్తుంది.

ఆ మాట నేర్పు కలవాడు కాబట్టే వాయుసూనుడు మొదటి చూపులో రామునికి ఆత్మీయుడయ్యాడు. అలాగే ఇచట సీతా మాతయు ఆత్మబంధువు వలె చూచింది మారుతిని. పీడలేక, పీడ లేక గుండె దిటవు చేసుకుని వీడ్కోలు చెప్పింది. సాగర లంఘ నానికి సిద్ధమయ్యాడు. అంతలోనే తన కార్యం అసంపూర్తిగ నున్నట్లు తోచింది. తాను వచ్చుటలోని ప్రధానాంశం సీతను చూచుట, సంభాషించుట జరిగినది. ఇక యీ లంకను గురించిన విశేషాలు తెలుసుకోవాలి? సముద్రతీరాన గల దీని ఉనికి తెలిసి కొనిదే వెళ్ళుట సమంజసం కాబోదు.

రాక్షసులు సామ, దాన, భేద, దండోపాయాలలో- మొదటి మూడింటికి లోబడరు. తామసులైన యీ రాక్షసులపట్ల సామం పనికిరాదు సకల సంపదలతో తులతూగే వీరియెడ దానం పనికి రాదు. బలపరాక్రమోపేతులగుట భేదం పనికిరాదు ఇక వీరియెడ దండోపాయమే తగినది. పరాక్రమ ప్రకటనమే సరైనదని నాకు తోచుచున్నది. పూర్వకార్య విరోధం లేకుండగ అనేక కార్యాలను సాధించువాడే- కార్యసాధకుడు, సమర్థుడనిపించుకొనును. శత్రు

వుల బలాబలాలను బేరీజు వేసుకొనుటకు ఈ అవకాశం ఉపయోగించుకోవాలి. వానరుల, రాక్షసుల యుద్ధ విధానంలో గల తేడాలు తెలుసుకొనుట మంచిది. అంతేకాక నా బాహుబలంతో శత్రుసేనను కొంతవరకు రూపుమాపిన మిగిలినవారిని సంహరించుట సుగ్రీవాంగద రామ లక్ష్మణులకు తేలికైన పని. రావణునికి తమ శక్తి సామర్థ్యములను తెలియచేసినట్లయి- కనువిప్పు కలిగించ గలదేమో! దూతయినవాడు అన్ని కోణాలనుండి తన ప్రభువు కార్యాన్ని సాధించగలగాలి. తానే ముందుగా శత్రువును కవ్వించి, కదనానికి రప్పించి కాలుని సన్నిధానానికి పంపాలి. అందుకు తగిన విధానం రావణునికి అత్యంత ప్రీతిపాత్రమైన అశోక వన విధ్వంసనం.

తలచినదే తడవుగా కర్తవ్యోన్ముఖుడై మనోహర సుందర నందన వనమును బోలిన అశోక వనమును- కొన్ని చెట్లు పెకలించి, మరికొన్నింటి కొమ్మలు విరచి కళకళలాడే ఆ వనాన్ని చిందరవందర చేశాడు. ఎదిరించిన వనపాలకులను మట్టుబెట్టాడు. ఈ వార్త రావణునికి చేరింది. ఆశ్చర్యపడి తనతో సమాన బలశాలురయిన కింకర గణాన్ని- ఆ వానరుని దండించమని పంపాడు. మారుతి వారిని యమపురి కంపాడు. మహావీరుడు జంబుమాలి, మంత్రుల పుత్రులు, సేనా నాయకులు దుర్ధర, విరూపాక్ష, యూపాక్ష, భాసకర్ణాదులు యమాలయాని కతిథులైరి. అక్షకుమారుడును సమవర్తి సన్నిధి చేరాడు. రావణ ప్రేరితులై ఒకరి తరువాత ఒకరు వచ్చుటే కాని మరలిపోయినది లేదు. తోరణ స్తంభము నెక్కి సింహనాదం చేస్తూనే ఉన్నాడు. వీర సంహారానంతరం. ఆ నాదం చెవిబడగనే శత్రువుల గుండియ లదరి ఆగిపోవుచున్నవి. ఒకరితో యుద్ధము చేసిన రీతి మరొకరితో చేయుట

లేదు. ఆ అరుపులు,చరుపులు, వివిధ యుద్ధ భంగిమలు- ఈనాటి కరాటేలాంటి విద్యలను తలపించుచున్నవి. అంటే యీవిద్య- అనాడు ఆంజనేయుడు చూపినదేనేమో!! అరుపులతో అదరగొట్టటం- చరుపులతో చావుదెబ్బ తీయటం-

తోరణ స్తంభమెక్కి సింహనాదం చేస్తూ-

జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః.
దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః.
న రావణ సహస్రం మే యుద్ధే ప్రతి బలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః.
అర్దయిత్వా పురీం లంకాం అభివాద్య చ మైథిలీం
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వ రక్షసాం.

మహా బలశాలురైన రామ లక్ష్మణులకు జయమగు గాక! మా సుగ్రీవ మహారాజునకు జయము !!

ఎంత క్లిష్ట కార్యాన్నయినా అవలీలగా అనాయాసంగా చేయగల నేను వాయు కుమారుడను. హనుమంతుడను. రామదాసుడు. శత్రు మర్దనుడను.

రాళ్ళు, చెట్లు పెకలించి విసరివేస్తూ పోరు సాగిస్తుంటే- వేయిమంది రావణులైనా నా ఎదుట నిలబడలేరు.

లంకను లవలేశం కూడా లేకుండా చేయుగలను. జానకికి అభివాదం చేసి-రాక్షస గణం బెంబేలెత్తి బిత్తరపోయి చూస్తుంటే- సంతోషాంతరంగుడనై తిరిగి వెళతాను.

ఒకవైపు అరివీర భయంకర స్వరూపం. మరోవైపు వినయ విధేయతలు. మారుతి యీ ప్రవృత్తి మహా మహిమాన్వితమైనది.

ఓ రాక్షసులారా! చూస్తున్నారుగా నన్ను. ఈపాటికి నా శక్తి ఏమిటో మీకు తెలిసే ఉంటుంది నాలాంటివారు మా రాజు కొలువులో వేలకొలది ఉన్నారు. కొందరు పది ఏనుగుల బలం కలవారైతే ఇంకొందరు వంద ఏనుగుల బలం కలవారు. ఇంకొందరో! వేయి ఏనుగుల బలం కలవారు. వారందరూ తరలి వచ్చారో- మీరూ, మీ లంకా నామ రూపాలు లేకుండా పోతాయి. ఇది నిజం. అంటూ ప్రాకార స్తంభం పెకల్చి విసిరివేశాడు. రాక్షస వీరులు ప్రాణభీతితో పరుగెత్తసాగారు.

ఈరీతిగా అంజనేయుఁడు చిత్ర విచిత్ర గతులతో చెట్లు పెకలించి, విసిరివైచి, గోళ్ళతో చీల్చి, పిడికిళ్ళతో పొడిచి, కాళ్ళతో మర్దించి, బిగ్గరగా అరచి వీర విహారం చేస్తూ తనపై దాడిచేసిన శత్రువులను మట్టుబెడుతున్నాడు.

రావణుని మదినిండా కలవరం, కలకలం. తాను పంపిన ప్రతి యోధుడూ మరలి వచ్చుటన్నది లేదు. బ్రతికి బట్టకట్టగలిగినవాడు లేడు. తనకూ, తనవారికి రణరంగమంటే కందుక క్రీడ. ఓటమి యెరుగని యోధాను యోధులు ఒక్క కపికి ఆహుతి అయ్యారు. ఇపుడేం చేయాలి అని ఆలోచిస్తుండగా- ఆ వానరుని బంధించగలవాడు తన పెద్ద కొడుకు ఇంద్రజిత్తే ననిపించింది. ఇంద్రజిత్తు మహావీరుడు. సుర నాయకుని, సకల దేవతలను గడగడ లాడించినవాడు. ఎందరో శత్రువులను మట్టి కరపించిన ఇంద్రజిత్తుని రావించి, "కుమారా! ఈ కోతి సామాన్యమైనది కాదు. ఇతని ముందు మన సేనలు ఎందుకూ కొరగాకుండా

పోతున్నాయి. వజ్రాయుధం సైతం పనిచేయుట లేదు. గతంలో నేనెందరినో హరి వీరులను చూచాను. జాంబవంతుడు, వాలి సుగ్రీవులు, మైంద, ద్వివిదుడూ- మొదలైనవారి బల ధైర్య, సాహసాలను నేనెరుగుదును కాని వారెవ్వరిలో లేని యుద్ధ గతి, పరాక్రమోత్సాహాలూ, రూపగుణ విశేషాలూ యీ వానరంలో కనిపిస్తున్నాయి చూడగా ఒక పెనుభూతం యీతని రూపంలో వచ్చినట్లు తోస్తున్నది. అతనిని తేలికగా తీసుకోరాదు అతనిపట్ల ఏమరుపాటు తగదు. బాహాబాహీ పోరు పనికిరాదు. బ్రహ్మాస్త్రం పొందిన నీవు తప్ప మరెవరూ అతని ధాటికి తట్టుకోలేరు. అతని ప్రతి కదలికా గమనిస్తూ- పట్టి బంధించు. విజయుడవై తిరిగి రా" అని హనుమంతునిపై యుద్ధానికి పంపాడు.

ఇంద్రజిత్తు అత్యుత్సాహముతో పవన కుమారుని తాకెను. ఇద్దరకు పోరు ఘోరముగ సాగినది. ఇంద్రజిత్తు క్షాత్ర విద్యలు, మాయా విద్యలు మాయలు నేర్చిన ఆంజనేయుని ముందు నిర్వీర్యము లయినవి. మహావీరుడైన మారుతి రణపాండిత్యానికి మేఘనాథుడు ఆశ్చర్యపడి, మిగిలిన బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. బ్రహ్మ వరం పొందిన ఆంజనేయుని బ్రహ్మాస్త్రం బంధించలేదు కాని రావణుని చూడతలచి తానే ఇచ్ఛాపూర్వకంగా బంధీ అయ్యాడు.

## విజ్ఞుడగువాడు మెప్పొందు విశ్రుతుడైన

ఇంద్రజిత్తు కపివరుని రావణ సభముందు నిలిపాడు బంగరు గద్దియపై అసమాన తేజస్సంపదతో వెలుగొందే రావణుని చూచి

అహో రూప మహో ధైర్యం అహో సత్త్వ
మహోద్యుతిః
అహో రాక్షస రాజస్య సర్వలక్షణ యుక్తతా.

స్యాదయం సుర లోకస్య స శక్రస్యాపి రక్షితా
అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తుమేకార్ణవం జగత్.

ఆహా! ఏమి రూపం! ఏమి ధైర్యం! ఏమి సత్త్వం! ఏమి శాంతం! మూర్తిభవించిన సర్వ శుభ లక్షణ లక్షితుడై విలసిల్లే యీ రాక్షస రాజు సురలోకమును సైతము పాలింప శక్తి సంపన్నుడు. ఇతడే అలిగిననాడు లోకాలను, సముద్రమున ముంచెత్తక పోవునా! అటువంటివానిని పరదారా వ్యామోహం ఎంతగ పెడదారి పట్టించినదో గదా!

అలాగే లంకేశ్వరుడును మారుతిని చూచి-

శంకా హృతాత్మా దధ్యౌ స కపీంద్రం తేజసా వృతం
కిమేష భగవాన్నందీ భవేత్సాక్షాదిహా గతః.
యేన శప్తోస్మి కైలాసే మయా సంచాలితే పురా
సోయం వానరమూర్తి స్స్యాత్ కిం స్విద్బాణోపి వా సురః.

వీడు ఎచటినుండి ఇటకు వచ్చినాడు? ఏ పనికై వచ్చియుండును? వచ్చినవాడు వనభంగము చేయనేల? రాక్షసులను నిర్జింప నేల? అలనాడు కైలాసగిరిని కదలింప నందీశ్వరుడు నాపై ఆగ్రహమును చూపెను కదా! అతడే యీ కపి రూపాన వచ్చియుండునా? ఏమి తేజము? కానిచో బాణాసురుడు యీ ఆకృతిన రాలేదు కదా! అని శంకా హృతాత్ముడాయెను.

ఈ సన్నివేశంలో ఆంజనేయుడు నిర్వహించిన పాత్ర అసాధారణమైనది. కార్యసాధకుడు సమయస్ఫూర్తితో బాగుగా ఆలోచించి ఆత్మవిశ్వాసంతో సమయోచిత నిర్ణయం చేయగల ధైర్య

స్థైర్యాలు, బుద్ధి విశేషం— తరతరాలవారికి తరగనిగనిలా అందిం ఉన ఆదర్శవంతుడు.

సామాన్యంగా సమాజంలో- విరోధిలోని లోపాలను ఎత్తి చూపి- అతనిని ద్వేషించేటట్లు చేయటానికే పాటుపడతారు కాని మంచినిమాత్రం మసిపూసి మారేడుకాయగా చేయచూస్తారు. అది పొరపాటు. మన కయిష్టునిలోని సద్గుణాలను, సదాశయాలను గౌరవించటం ధర్మం. దుర్గుణాలను ఎలాగూ విమర్శిస్తాం కదా. ఈ విషయంలో తరతమ భేదం చూపరాదన్నమాట. అలాగే ఆకారాన్ని చూచి అతని స్వభావ గుణ సంపత్తిని బేరీజు వేయరాదు. ఆకారమున్న- గుణముండబోదు. గుణమున్న ఆకారము లేక పోవచ్చు. ప్రధానం ఆకారం కాదు గుణం. ఆత్మ నముపమానంగా చేసుకుని నిర్ణయించాలి ఇదే భావాన్ని తెలిపే ఒక చాటువు ఇలా ఉంది.

విజ్ఞుడగువాడు మెప్పొందు వికృతుడైన
సుందరుండగు మూర్ఖుని చూడరెవరు
వాసనలు గల్గు కురు వేరు వాసికెక్కు
అందమైనట్టి మోదుగ నడుగరెవరు.

కోపావేశంతో కనుల నిప్పులురాల రావణుడు మంత్రిసత్తముడైన ప్రహస్తునితో "దురాత్మా! పృచ్ఛ్యతాం మేష కుతః కిం వాస్య కారణం, వనభంగే చ కోస్యార్థో రాక్షసీనాం చ తర్జనే". ఈ దురాత్ముడు మన వీటికేల ఏతెంచెను? వన భంగ మొనర్చనేల? రాక్షసుల నేమి కతంబున హింసించెనో అడుగు" మని కాలయుక్తంగా అర్థవంతంగా పలికిన పలుకు లాలకించి హరి సత్తముడు లంకాధీశునకు—

10 )

# హనుమంతుని దౌత్యం -

## అసత్యం పిరికివాని లక్షణం :

రాక్షసేంద్రా! మీరనుకుంటున్నట్లు నన్ను ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు- పంపలేదు. విష్ణుని దూతనూ కాను. ఉన్నమి తౌజసుడగు రాఘవుని దూతగా తెలిసికొనుము. నేను వేషధారిని కాను. వానరుడనే. ఒక రాచకార్య నిర్వహణార్థం ఇచటికి వచ్చాను. లంకేశ్వరుని చూడ- వన భంగం కావించాను. ఉన్మత్తు డను కాను. ఆత్మరక్షణకై ఎదిరించిన రాక్షసుల వధించాను. దేవ దానవులెవరూ నన్ను అస్త్రాలతో బంధించజాలరు పితామహుడట్టి వరాన్ని ప్రసాదించినాడు రాజ దర్శన కాంక్షినై నేనే బ్రహ్మాస్త్రా నికి పట్టుబడ్డాను. మూర్ఖులు రాక్షసులు ఇతర పాశాలతో బంధిం చగా- ఆ అస్త్రబంధనం నుండి కూడా విముక్తుడనైనాను. 'మమ పథ్యం ఇదం వచనం చాపి శ్రూయతాం' పథ్యములైన నా మాట లను సావధానంగా వినవలసినది.

అహం సుగ్రీవ సందేశాత్ ఇహ ప్రాప్త స్తవాలయం
రాక్షసేంద్ర హరీశస్త్వాం భ్రాతా కుశలమబ్రవీత్.

ఓ రాజా! నేను వాలి సోదరుడగు సుగ్రీవ సచివుడను. నీ సోదరుడైన సుగ్రీవుడు మొదటగా నీ కుశలం అడగమన్నాడు. జన కుని మాటను జవదాటక రాముడు సీతా లక్ష్మణ సహితుడై విపిన భూములకేతెంచి- దండాకాటవిన నపహృతయైన జానకి నన్వేషించుచు ఋష్యమూకము చేరినాడు. రామ, సుగ్రీవులు మిత్రులుగ పరస్పరం ప్రతిజ్ఞలు చేసుకున్నారు. వాలిని నీవెరుగు దువు గదా! ఒక్క బాణముతో వాలిని వధించి సుగ్రీవుని కిష్కింధ

కభిషిక్తునిగ చేసినాడు. సుగ్రీవుడు సర్వ దిశలకూ సీతాన్వేషణకై వానర వీరుల నంపినాడు. నేనిచటి కామె నన్వేషింప వచ్చి

"దృష్టా హీయం మయా దేవీ లబ్ధం యదిహ దుర్లభం
ఉత్తరం కర్మ యచ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః.

అశోకవనాన జనక నందినిని చూచాను. ఇక మిగిలిన కార్యమును నిర్వర్తించుటకు అవట రఘురాముడున్నాడు. ముమ్ముందు జరుగబోవు తీవ్ర పరిణామం నీవు గమనించినట్లు లేదు. నీ హితము కోరి చెప్పే నా హితవు నాలకింపుము.

జన స్థాన వధం బుద్ధ్వా బుద్ధ్వా వాలి వధం తథా
రామసుగ్రీవ సఖ్యంచ బుధ్యస్వ హితమాత్మనః.

జనస్థానమున నీ అనుంగు సేవకులు ఖర, దూషణాదులను మన్ను కరపించినదీ- నిన్ను చంకన ఇఱికించి సప్త సముద్రాల ముంచి ఊపిరితో వదలిన బల పరాక్రమశాలి వాలిని ఒకే ఒక్క బాణంతో నేలకూల్చిందీ- రాముడు. ఆ రామ, సుగ్రీవ సఖ్యం నీకు ప్రాణాంతకం అన్నది గుర్తుంచుకో. రాజా! నీవు తెలియనివాడవనుకోను. తపస్సంపన్నుడవు. సర్వశాస్త్ర విశారదుడవు. మీదు మిక్కిలి ధర్మము నెరిగినవాడవు. బుద్ధిమంతుడు క్షణక్షణం ప్రమాదాల నిలయం అధర్మ కార్యం అని- వాని జోలికి పోడు. నీ ఈశ్వర భక్తి- తపశ్శక్తి అధర్మము నుండి కాపాడలేవు. దేని ఫలితము దానిదే. ఇప్పటివరకు ధర్మఫలితము ననుభవించావు. ఇక అధర్మ ఫలితాన్ని రుచి చూడబోతున్నావు.

నీ వశమందున్న సీతను సామాన్య వనితగా భావింపకుము. ఆత్మరక్షణ సమర్థురాలయ్యు- అది తన నాథుని కపయశమని

ఆగింది. "గృహ్యేయాం నాభి జానాసి పంచాస్యమివ పన్నగిం." ఆమె నీ ఇంట నున్న పంచాస్య పన్నగమని తెలిసికో. విష సంసృష్ట మత్యర్థం భుక్తమన్న మివౌజసా. అవివేకివైనా గరళాన్నాన్ని తినగోరుసా! ఆమె కాళరాత్రి. లంకా నాశనకారిగా గ్రహించు.

కాళరాత్రీతి తాం విద్ధి సర్వలంకా వినాశినీం
తదలం కాలపాశేన సీతా విగ్రహ రూపిణా.

ఇక దేవదానవుల వలన అపజయ మెరుగని వరం పొందిన నీవు నర, వానరజాతివారైన రామ లక్ష్మణుల చేతిలో చావు కోరి తెచ్చుకోకు. వానర, భల్లూక వీరులు వందల, వేల ఏనుగుల బలం కలవారు, నీ సేనాబలం వారి ఎదుట నిలబడలేదు ఇంతెందుకు.. నా ప్రభువాజ్ఞ లేదుగాని ఉన్నచో నేనొక్కడనే చాలు. నిన్ను, నీ రాజ్యాన్ని సర్వనాశనం చేయుటానికి.

కాన ఓ రాజా! కడసారి చెప్పు నా హితోపదేశాన్ని ఆచరించు. నీకై ఇందరి ప్రాణాలను పణంగా పెట్టకు. లంకకు చేటు తీసుకు రావద్దు. రాము నెదిరించ దేవ, దానవు లెవరూ సమర్థులు కారు. రాముడు ఎన్ని తప్పులు చేసినా శరణన్నవానిని కాపాడు ఆర్త త్రాణ పరాయణుడు. పరమ దయాళువు. ఆ మహానుభావుని శరణు కోరు. జన క్షయం కోరకు రావణా!

వీర వరేణ్యుడైన రఘువీరున కెగ్గొనరించి దేవ దే
వాదుల లోన నెవ్వరును బ్రాణము తోడ సుఖంబు నొందగా
నేరరు గాన నా పలుకు నిక్కముగా మదినమ్మి సీత నా
ధారుని నేత కిచ్చి పుర దార సుతాదుల గావి కొమ్మొగిన్.

తలలు త్తరించే తలారులను కూడ తలలు వంచునట్లు చేసేది

వాక్కు. మాట నేర్పుతో- కోపాగ్ని జ్వాలలు తక్కేవాడు కూడ నిరుత్తరుడై చేష్టలుడిగి వినునట్లు చేయగలదీ, తల ఊపించేదీ- మాట. ఈ సన్నివేశంలో ఆంజనేయుడు మహోన్నత రాజనీతిజ్ఞుడుగ, వాక్య విశారదుడుగా కనిపిస్తాడు సర్వకాలానుగుణమైన నయ శాస్త్రాన్ని రాజనీతివేత్తలు "జౌరా" అనునటుల వినిపించినాడు. రాక్షసరాజ సభలో ఉత్తమ రాయబారిగ గోచరిస్తాడు. ప్రదర్శించిన ధైర్య సాహసాలు- బంధీయై కూడ నిర్భీకుడై తొణుకు బెణుకు లేకుండ తాను చెప్పదలచుకున్న నీతి వాక్యాలను నిర్మొగమాటంగా వినిపించుట మరొకరికి సాధ్యము కానిపని. ప్రసంగ నైపుణి రాజకీయ నాయకులు, ప్రభుత్వ అధికారులు, సంఘ నేతలు- మొదలగువారు అవశ్యం నేర్వవలసినవి.

కార్యసాధకుడు- శత్రు బలగాలను పరిగణనలోనికి తీసుకొని ఏకరీతిగా వారిని భయకంపితులను చేయవలెనో ఆ రీతిగా చేయుట, దోషిగా భావించినపుడు- ఆత్మరక్షణకలా చేయవలసి వచ్చిందని తన నిర్దోషిత్వమును నిరూపించుకొనుట- రాజుగా ఉండవలసిన విధానం, రాజ ధర్మాన్ని మరచిన కలుగు కష్ట నష్టాలు- వివరించిన రీతి అందరూ నేర్చుకోవలసినది.

"దుర్బలస్య బలం రాజా" అన్నది సూక్తి. దుర్బలులంటే- స్త్రీ, బాల, వృద్ధులు, అనాథలూనూ. వీరికి అండదండ లందించవలసిన రాజు నీతిదప్పి పట్టపగతే నట్టివీధిని పట్టబోరే జార చోరులు అన్నటుల ప్రవర్తించరాదు. అహంకార, దౌర్జన్యాలతు రాజుగా చోటీయరాదు. చెల్లియుండియు సైరణ సేయుగలగాలి. ఎంతటివారైన ధర్మం తప్పిన అధోగతే. ఇవన్నీ హనుమంతుని దౌత్యం మనకు నేర్పుతుంది.

## ఆగ్రహ జ్వాల - లంకా దహనం

**వధే తస్య సమాజ్ఞప్తే రావణే న దురాత్మనా.**

హనుమత్సందేశం విన్న రావణుడు సలసల కాగే నీటిపై చల్లని నీరు చల్లిన మంటలెలా గగనాని కెగయునో- అలా ఒక్క సారి ప్రచండాగ్నివలె మండిపడి 'దూత' అను మాట మరచి, అతనిని పట్టి చంపుడని ఆజ్ఞాపించగా-

**సాధుర్వా యది వాసాధుః పరై రేష సమర్పితః**
**బ్రువన్ పరార్థం పరవాన్న దూతో వధ మర్హతి.**

రాక్షసరాజా! దూత మంచివాడుగానీ, చెడ్డవాడుగానీ దూత అయినందువలన చంపరాదు. అతడాడు మాటలు తన ప్రభువువి కాని తనవి కావు. దూత అస్వతంత్రుడు. అందతని దోషమే మున్నది? కాన లోక విరుద్ధమూ- రాజనీతి వ్యతిరేకమూ అగు పని మనము చేయుట పాడి కాదు. మన కప్రియముల నొనరించి నందున బోడితల చేయుటో- కొరడాతో కొట్టుటో- అంగహీనుని చేయుటో వంటి శిక్షలు కలవు. వానిని చేయువచ్చుననగా రావణుడు—

**"కపీనాం కిల లాంగూలం ఇష్టం భవతి భూషణం**
**తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు".**

కోతులకు తోక అలంకారం ఆ తోకను వెంటనే తగలబెట్టండి. నలుదిక్కుల తిప్పి పరాభవించి పంపండి. తోక లేని ఆతడు తన జాతివారిలో పరిహాసపాత్రుడు కాగలడు".

తమ రాజు నోటినుండి యీ మాట వచ్చినదే తడవుగా రాక్షసులు పాత బట్టలు తెచ్చి నూనెలో ముంచి తోకకు చుట్టి అగ్ని

నంటించగా- భగ భగ మండే అగ్ని జ్వాలలు వెనువెంటనే విను వీధిని తాకినవి. ఈ వింత చూడ రాక్షస, రాక్షసీ గణము తమ తమ ఇళ్ళనువీడి వీధిలోకి రాసాగింది. మారుతి మండే వాలం ఎత్తి కొందరిని చావమోదాడు. కొందరు రాక్షస స్త్రీలు యీ వార్తను సీత చెవిన వేయగా- దుఃఖించినదై అగ్ని వలన వాయుకుమారునకు ఏ కీడూ జరగరాదని, "అతనికి చల్లదనము కలిగించ" మని అగ్నిదేవుని ప్రార్థించింది. ఆమె అభ్యర్థనమును మన్నించినట్లుగ- హనుమానునికి వెచ్చదనమునకు మారుగా వాలము శీతలముగనే యున్నది.

అటులుండుటకు ఆనందాశ్చర్యాలను పొందిన పావని "అగ్ని సఖుడైన తన తండ్రి వాయువు వలన గాని, ఆ రఘురాముని వలనగాని ఇలా జరిగి ఉంటుందని" భావించి తన దేహాన్ని కుంచింప చేసుకుని, కట్లను త్రెంచుకుని ఈ రాక్షసులు నన్ను ఏ అగ్నితో మర్యాద చేశారో- ఆ అగ్నితోనే వారికి మర్యాద చేస్తాను అని ఉత్సాహంగా ఒక్కసారి కుప్పించి పైకెగరి ఒక భవనం పైనుండి మరో భవంతిపైకి దూకుతుంటే- ఆ భవనాలన్నీ ఫెళ ఫెళార్భటులతో మంట లంటుకుని జ్వాలామాలికా తోరణాలయ్యాయి. ప్రహస్తుడు, రశ్మికేతుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మొదలగు రాక్షస వీరుల ఇళ్ళన్నీ క్షణాలమీద అగ్నికి ఆహుతి కాసాగినయ్. ఎటుచూచినా- రాక్షసుల ఆక్రందనలే- విషాద గీతాలే.

"వామ్మో! వీడెవడో!! ఇంద్రుడో! బ్రహ్మో! నిర్జర నాథుడో! అయివుంటాడు. చూస్తుండగానే లంకకు ఎంత చేటు వచ్చింది" అని వాపోతూ రాక్షసులు విలపించసాగారు.

## పశ్చాత్తాపం - ఆత్మ పరీక్ష

మిన్నంటే రాకస హాహాకారాల మధ్య లంకంతా అగ్నికి ఆహుతికాగా అంజనీ సుతుడు లాంగూల జ్వాలను సముద్ర జలాల చల్లార్చుకుని వెనుదిరిగి చూడగా అగ్నికి ఆహుతి అయిన లంకా నగరం హృదయ విదారకంగా కన్పించింది. అంతలోనే అశోకవనాన సీత గుర్తురాగా- "తానెంతో తప్పు చేయటం జరిగింది. ఆవేశంలో అశోకవనంలో సీతామాత ఉన్న సంగతి గుర్తించలేక పోతినే! ఎంత దారుణానికి ఒడిగట్టాను. తానింతగా కష్టపడింది ఇందుకోసమేనా!" అని తన పనిని గూర్చి తాను వితర్కించు కుంటూ—

ధన్యాస్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోపముత్థితం
నిరుంధంతి మహాత్మానో దీప్త మగ్ని మివాంభ సా.
క్రుద్ధః పాపం న కుర్యాత్కః క్రుద్ధో హన్యాద్గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్.
వాచ్యా వాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్
నా కార్యమస్తి క్రుద్ధస్య నా వాచ్యం విద్యతే క్వచిత్.

ఆగ్రహావేశాలతో తాను చేసిన పని ఇది. జ్వాజ్వల్యమానంగా వెలుగొందే అగ్నిని నీటితో చల్లార్చినటుల- హృదయ కుహరాల నుండి ఉవ్వెత్తున ఎగిరే ఆగ్రహ జ్వాలలను- క్షమాగుణంతో ఆర్పువాడే మహాత్ముడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలలో రెండవది క్రోధం. అంటే కోపం. క్రోధి ఎంతటి దారుణానికయినా వెనుదీయడు. మహా పాప కార్యమైన గురు హత్యకు పాల్పడతాడు. కఠినమైన అతని వాక్కులు గుండెకు

మానని గాయాలు. సాధు, సజ్జనులకు కోపగాని మాటలు అంపపు కోతలు. మంచి చెడుల విచక్షణ, పాపభీతి- అసలే ఉండదు. నోటికి వచ్చినదెల్ల పలుకుతాడు. చేతకు వచ్చినదెల్ల చేస్తాడు.

"నేను సీతామాత క్షేమాన్ని మరచి, అగ్నికి లంకను ఆహుతి చేయుటం ఎంత సిగ్గుమాలిన పని. ఆమెకేదైన కీడు జరిగి ఉంటే- స్వామి కార్యం చెడగొట్టిన నా జన్మ నిరర్థకం. బుద్ధిహీనుడనై నా వానరత్వాన్ని ఋజువు చేశాను" అని వ్యాకులత నొంది మరల వివేకంతో "సీతారాముల ప్రభావం వలన అగ్ని- నన్నే ఏమీచేయ లేదు. అటువంటపుడు పరమ కళ్యాణీ, పతివ్రతా శిరోమణి సీతను అగ్ని దహించునా! నాగ్ని రగ్నే ప్రవర్తతే! అగ్నిని అగ్ని దహించదు. ఆమె తేజస్సంపదయే ఆమెను కాపాడును" అని అనుకొనుచుండగా-

దగ్ధేయం నగరీ సర్వా సాట్టప్రాకార తోరణాః
జానకీ న చ దగ్ధేతి విస్మయోద్భుత ఏవ నః.

ఆకాశవీధిన సంచరించు సిద్ధచారణులు- "లంకంతా బూడిద బుగ్గి అయినా జానకిని ఏమాత్రపు అగ్నిశిఖా తాకలేదు. ఎంత ఆశ్చర్యం" అని సంభాషించుకొను మాటలు చెవులబడగా మారుతి అమితానంద మానసుడాయెను.

ఈ సన్నివేశమున ఆంజనేయుడు నవనవోన్మేషమైన బుద్ధి విశేషమును కనబరచాడు. నిజం ఎంతో నిష్ఠురమైనది. అందుకే మనకొక సామెత ఉంది. నిజం చెప్పేవాడికి లోకమంతా విరోధులే. ఈ లౌకికపు మాట ఆచరణీయం కాదంటుంది చాణక్య నీతి. "సత్యం వల్లనే భూమి స్థిరంగా ఉంది. సత్యం వల్లనే

సూర్యుడు తపిస్తున్నాడు. సత్యం వల్లనే గాలి వీస్తుంది. సత్యం వల్లనే జగత్తంతా నిలిచిఉంది". మరి నిష్ఠుర సత్యం తనకెంతో హాని అని ఆగక ఆంజనేయుడు మంచిని ప్రబోధించినందుకు ఫలితం లాంగూల దగ్ధం. ఐనా వెరవక దానితోనే శత్రుమర్దన చేయటం జరిగింది, భయపడి సత్యం దాచరాదు అసత్యం చెప్పటం పిరికితనానికి చిహ్నం లోకంలో గాలామండి తాము చేసింది అణువైనా పరమాణువంత గొప్పతనంగా చెప్పుకోవటం ప్రత్యక్షంగా జరుగుతున్నదే కాని అది హర్షణీయం కాదు. తాము ఎంతో చేసి కొద్దిగా చేశానని చెప్పటం, అదీ దైవానుగ్రహం. పెద్దల ఆశీర్వాదంగా భావించటం వినయవంతుల లక్షణం అదే హనుమ లంకా దహన సందర్భంలో తన తండ్రి, శ్రీరామచంద్రుల అనుగ్రహం వల్ల అగ్ని తన వేడిమితో నన్ను బాధించటం లేదు అని చెప్పుట. ఈ విషయాన్నే ఒక కవి ఇలా చెప్పాడు.

చేయకుండ జేసితినని చెప్పునాత
డధముడు, రవంతజేసి కొండంతచేసి
నాడననువాడు గర్వి యెంతయో యొనర్చి
సుంత జేసితి ననువాడు సుజను డిలను.

## ఆంజనేయుడు - ఉత్తమ వార్తాహరుడు

తతః కపిం ప్రాప్త మనోరథార్థ
స్తామక్షతాం రాజసుతాం విదిత్వా
ప్రత్యక్షత స్తాం పునరేవ దృష్ట్వా
ప్రతి ప్రయాణాయ మతిం చకార.

తత స్తు శింశపా మూలే జానకీం పర్యుపస్థితాం
అభివాద్య అబ్రవీద్దిష్ట్యా పశ్యామి త్వామిహాక్షతాం.

మరల తిరిగి ఒక్కసారి సీతామాతను దర్శించు కోరిక కలిగింది. వెంటనే ఒక్క ఉదుటున అశోకవనం చేరి శింశుపా వృక్షచ్ఛాయలో నున్న జానకీ మాతకు నమస్కరించి- ఆమె ఆశీస్సులనంది కిష్కింధ కేగనెంచి ప్రస్రవణ పర్వతం పైనుండి ఉత్తర దిక్కుగా పయనించసాగాడు. సమధికోత్సాహంతో అంజనేయుడు రామబాణంలా ముందుకు సాగిపోతూ మార్గమధ్యాన మైనాకుని పలకరించి, మహేంద్రగిరి సమీపం చేరబోతూ ఉల్లాసంగా, ఉత్సాహంగా మేఘధ్వనిని బోలిన ధ్వనిని చేశాడు. ఆ గంభీర ధ్వని విని జాంబవంతుడు "మన మారుతి సీత జాడ తెలుసుకుని వస్తున్నాడు. అందుకే విజయధ్వనిని సంకేతంగా చేశాడు. నిస్సందేహంగా ఆ ధ్వని అంజనేయునిదే" అని వానరులకు తెల్పగా-అవధిలేని ఆనంద తరంగాల తేలియాడారు వానరులు. చెట్ల కొమ్మలను ఊపుతూ, పెద్ద ధ్వనిచేస్తూ, కేకలు వేస్తూ, కిలకిలారావాలు చేస్తూ-తోకను పైకెత్తి నేలకేసి కొడుతూ. తమ బట్టలను చింపుకుంటూ-అంజనేయునకు మధుర ఫలాలను అందింప చూస్తున్నారు. ఈ రీతిగా ఆ ప్రాంతమంతా ఎటుచూసినా వానరుల ఆనంద కోలాహలంతో నిండిపోయింది.

అంజనేయుడు క్రిందికి దీగబోతూ "దృష్టా సీతేతి విక్రాంతః సంక్షేపేణ న్యవేదయత్". చూచాను సీతను అశోకవనంలో అంటూ సంక్షేపంగా, సవివరంగా అచటి వార్తలను చెప్పగా "దృష్టేతి వచనం మహార్థం అమృతోపమం" చూచానన్నమాట అచటి వారందరికి అమృతోపమానమైంది అంజనేయుని సాహస కృత్యాలు వారిని అబ్బురపరచినవి. ఆనందసంద్రాన వారు పొంగిపొంగి ఉప్పొంగారు మారుతి నెంతగనో ప్రశంసించారు.

ఇచట హనుమంతుని వచోనైపుణి గమనింపతగినది. ఆంజనేయుడు వారిని వీడి వెళ్ళినది మొదలు వేయి కనులతో సీతామాత కనిపించినదన్న వార్త తెచ్చు పవన కుమారుని మాటకై నిద్రాహారాలు మాని ఎదురుచూస్తున్నారు. తనను చూడగనే వారికి పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లవుతుంది. అటువంటప్పుడు వారికే అనుమానం రానివిధంగా సంతోషం కలిగించే మాట ముందు చెప్పాలి. అందుకే 'సీతను చూచాను' అనలేదు,'చూచాను సీతను' అన్నాడు సీతను అని అనకముందే వ్యధాకులిత హృదయులై వానరులు సీతకేదో ప్రమాదం జరిగిందనే ఆవేదనకు లోనవుతారు. వారినలా నొప్పించరాదు. 'చూచాను' అని అంటే 'అమ్మయ్య' సీత కనిపించింది అని ఆనందపడతారు. ఇదీ మాటకారితనం అంటే!

వానరులంతా చుట్టూ చేరి— "తన ప్రయాణం ఎలా సాగిందని అడిగినపుడు ఆంజనేయుడు వారికి సముద్రమును లంఘించినది మొదలు తిరిగి వచ్చునంతదనుక జరిగిన విషయాలను విపులీకరిస్తాడు.

ఇందులో సీత జాడ- తనకెదురైన విఘ్నాలు- అబ్బురపరచే తన కదన పాండితి అంతా వారికి వివరిస్తాడేకాని సీతా సందేశం మాత్రం చెప్పడు. ఎవరితో ఎప్పుడు ఎంతవరకు చెప్పాలో అంతవరకే చెప్పాడు. మిగిలిన విషయాలు వీరికి చెప్పుట అనవసరం అని ఊరుకున్నాడు. ఇదీ హనుమంతుని వచో వైభవం.

వార్తాహరులైనవారు- వారిని మనం యీనాడు విలేఖరులు అంటున్నాం. విలేఖరులైనవారు తాము చూచిన, విన్నవానిని పత్రికల కెక్కించేముందు ఎంతవరకు ప్రజలకు తెలియచేయాలో, ఏ విధంగా తెలియచేస్తే ప్రజలు అవగాహన చేసుకుంటారో అంతవరకే వ్రాయాలిగాని అనవసరమైన విషయాలను పొందుపరచ

రాదు.అలాచేస్తే అవగాహనా లోపంవల్ల పరిస్థితులు పెడదారి పట్టే ప్రమాదముంది. వివేకంతో విలేఖరులు వాస్తవ విషయాలను ప్రజలకందించేటప్పుడు ఇలాగ ఉండాలి అని యీ సన్నివేశం తెలియచేస్తుంది

హనుమద్వాక్యములను విన్న అంగదుడు అమితానందభరితుడై-

సత్త్వే వీర్యే న తే కశ్చిత్ సమో వానర విద్యతే
యదప ప్లుత్య విస్తీర్ణం సాగరం పునరాగతః
జీవితస్య ప్రదాతా నస్త్వమేకో వానరోత్తమ.
త్వత్ ప్రసాదాత్ సమేష్యామః సిద్ధార్థ రాఘవేణ హ
అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః.

"వానరోత్తమా! బల పరాక్రమాలలో నీకు సాటిరాగలవారెవరూ న భూతో న భవిష్యతి. అతి విస్తీర్ణమైన సాగరాన్ని దాటి కార్యసాధకుడవై తిరిగివచ్చిన నీవు మాకు ప్రాణదాతవయ్యా! నీకై ఎంతగ ఎదురు చూచామో!! కాంతిలేని గాజు కళ్ళయిన మా కనులకు వెలుగును నింపినవాడవు నీవే! నీ మూలమున మేము సఫల మనోరథులమయ్యాము. రామ ప్రభుని దర్శన భాగ్యము నీ వలననే మాకు లభించుచున్నది. ఆ స్వామిపై నీకున్న భక్తి శ్రద్ధలు, నీ ధైర్యసాహసాలు- అహో! ఆశ్చర్యకారకాలు' అని అభినందించాడు.

వానరులందరూ రామ సందర్శనాభిలాషులై కిష్కింధకు పయనమయ్యారు. కిష్కింధ పొలిమేర చేరబోతుండగా- మధువనం కనిపించింది. అందలి మధువును ఆస్వాదింపకోరారు వానర వీరులు.అంగదుని అంగీకారంతో మధువనం వానరవీరుల కానంద నాట్యరంగ స్థలమైంది. మధు రసాస్వాదన మత్తులో కొందరు

ఆడగా- కొందరేమో పాటల పల్లవి అందుకున్నారు. కొందరైతే విరగబడి నవ్వసాగారు. ఇంకొందరు వదరుబోతులై అర్థమేలేని మాటలతో గారడీ చేయసాగారు. వన సంరక్షకుడూ, సుగ్రీవుని మేనమామా దధిముఖుడూ, అతని పరివారం మధుపాన మత్తులై మత్తులుపోయి వృక్షాలను ముక్కలుచేసే వానరులను చూచి విభ్రాన్తపడి- అంతలో తేరుకుని కర్తవ్యం గుర్తురాగా అడ్డగించారు. సమధికోత్సాహులకు మధుమత్తు తోడుకాగా- వానరులు వన సంరక్షకులను చిత్రవిచిత్ర భంగిమలతో చితకగొట్టారు. వనపాలకులు విక్రమబలంతో పరుగు లంఘించుకున్నారు. తమ ప్రభువు సుగ్రీవునికీవార్త చెవినవేయగా- దధిముఖునితో సుగ్రీవుడు "మామా! అంగద జాంబవంత హనుమదాది వానర వీరులు సీతను చూచారు. సందేహం లేదు. ఆ ఆనందంతో అలా చేశారు. వారి దోషం ఏమీ లేదు. వారిని మన్నించు. వారిని వెంటనే సాదరంగా, హృదయ పూర్వకంగా ఆహ్వానించు. రామ లక్ష్మణులు, నేను ఆ వానర వీరులను చూడగోరుతున్నామని చెప్పు" అని పంపి రామునితో-

కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసిహి సువ్రత
దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా.
నహ్యన్యస్సాధనీ హేతుః కర్మణోస్య హనూమతః
కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మిన్వానర పుంగవే
వ్యవసాయం చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితం.

రామభద్రా! అంగద, జాంబవంత, హనుమంతాది వానర వీరులు సీతను చూచే వస్తున్నారు. సందేహం లేదు ఎందుకంటే- వానరుల కిచ్చిన గడువు దాటిపోయిన తరువాత నాఎదుట నిలబడ

గల వానరులెవ్వరూ లేరు. గడువుదాటి వస్తున్నారంటే- నిస్సందేహంగా సీతామాత జాడ తెలుసుకున్నారన్నమాటే. పైగా మహోత్సాహంగా- మాతాత ముత్తాతలనుండి కంటికి రెప్పలా కాపాడుకునే మధువనం ధ్వంసం చేశారంటే- కార్యసాధనా మహోత్సాహమే కారణం.

ఈ కార్యసాఫల్యతలో ప్రధాన పాత్రధారీ, సూత్రధారీ హనుమయే. అతనిలో కార్యసిద్ధికి కావలసిన శక్తియుక్తులు, సఫలతా ప్రయత్నము, పరాక్రమము- పైగా శాస్త్ర పాండిత్యావగాహన పుష్కలంగా ఉన్నాయి. హనుమయే సీతను చూచి ఉంటాడు. దృష్టా సీతా న సందేహః.

## రాముని అభినందన

అని చెప్పుచున్నంతలో గగనాన కిలకిలారావాలు, ఉత్సాహ సింహనాదాలు సుగ్రీవునికి శ్రవణానందం కాగా, పర్వదినాలలో పొంగే సముద్రుని వలె ఆనందభరితుడై వాలం పైకెత్తాడు. అంగదాది వానర వీరులు ఉల్లాసంగా భూమికి దిగి రాముని ముంగిట నిలచారు. 'దృష్టా సీతా' అంటూ వినమ్రుడై రామునికి నమస్కరిస్తూ మారుతి చెప్పాడు. పావని మాటలు రామ లక్ష్మణులను ఆనందవార్ధిలో ముంచెత్తినవి.

రావణాంకఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా
ఏకవేణీధరా దీనా త్వయి చింతా పరాయణా
అధశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్య కృతనిశ్చయా
దేవీ కథంచిత్ కాకుత్స్థ త్వన్మనా మార్గితా మయా.

రామచంద్రా! లంకా నగరమంతా గాలించి రావణాంతః పుర అశోకవనాన వికారాకార రాక్షసీగణ పరివృతయై చిక్కి శల్యమైన జానకిని చూచాను. ఏకవేణీ ధారిణి, దీనురాలై నీపై చిత్తముంచి- సదా నిన్నే స్మరించుచు, కటిక నేలపై పవళించుచు వివర్ణమై హేమంతకాల పద్మినిలా రావణుని చూడనొల్లక మరణమె శరణముగా తలచిన మైథిలిని చూచాను అంటూ మొదలుపెట్టి- ఆమెకు నమ్మకమును కలిగించుటకు తాను చేసిన ప్రయత్నము- తనపై విశ్వాసముంచి ఆమె చెప్పిన కాకాసుర కథ, మనశ్శిలాతిలక వృత్తాంతం చెప్పి ఆనవాలుగా సీతామాత ఇచ్చిన చూడామణిని ఇస్తూ సీతా సందేశం కనులకు కట్టినట్లు వినిపించగా రాముడు చూడామణిలో సీతను చూస్తున్న అనుభూతిని పొంది కేసరి తనయుని అభినందిస్తూ-

కృతం హనుమతా కార్యం సుమహాత్ భువి దుష్కరం
మనసాపి యదన్యేన న శక్యం ధరణీతలే.

హనుమంతుడు అమిత శక్తిసంపన్నుడూ, ప్రాజ్ఞుడూ కాన లంకానగరం చూచి తిరిగి రాగలిగాడు. ఇతరులు దీనిని మనసున కూడా ఊహించనైనా ఊహించలేరు. సాగరయానం చేయగలవారు గరుత్మంతుడు, వాయుదేవుడు. వారికి సరిజోడు యీ హనుమంతుడు.

దుష్కర కార్యమునందు నియుక్తుడై యజమాని ఆజ్ఞను సమయానికి తగినరీతిగా నిర్వర్తించి వచ్చు సేవకుడు ఉత్తముడు. యజమాని కార్యమును చెప్పినంతవరకే సమర్థతగా నిర్వహించి వచ్చు సేవకుడు మధ్యముడు. స్వామి కార్యమును చెప్పినంత వరకైనా నెరవేర్చజాలని భృత్యుడు అధముడు.

అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః
వైదేహ్యా దర్శనే నాద్య ధర్మతః పరిరక్షితాః.

ఈ మహాత్ముడు నిస్సందేహంగా ఉన్నత శ్రేణికి చెందిన సేవకుడు. ఈతడొనర్చిన ఉపకారమునకు నేను, లక్ష్మణుడు, రఘువంశీయులు అంతా ఎంతో ఋణపడి ఉన్నాం. ఈతని ఉపకృతికి నా సర్వస్వం అర్పించినా సమానం కాదు.

మయి ఏక జీర్ణతాం యాతు య త్త్వయోపకృతం కపే
నరః ప్రత్యుపకారాణాం అపత్స్వాయాతి పాత్రతాం.

హనుమా! నీవొనర్చిన యుపకారము నాలో జీర్ణించుగాక. ఇదిగో! నా ఆలింగనమే యీ సమయాన నీకిచ్చు బహుమానం అని ఎంత తపస్సు చేసినవారికిని అందుకోరాని, అందుకోలేని గాఢ పరిష్వంగంతో సమ్మానించాడు.

ఆంజనేయుని ఔచిత్య సంభాషణ, విషయ వివేచనాశక్తి, ఉచితానుచిత ప్రవర్తన గమనింపతగినది. ఏమంటే- అంగద, జాంబవంతాదుల దగ్గర తన పరాక్రమం పరిక్రమించిన విధానం- ఆ అద్భుత సాహస కృత్యాలు వివరించాడేగాని సీతాసాక్ష సందేశం- ఆమె చెప్పిన ఆనవాళ్ళు చెప్పలేదు. ఇక రాముని సన్నిధిలో తన సాహసయాత్ర, బల ప్రదర్శన వగైరాలు చెప్పక కేవలం వైదేహి వచనాలే వివరిస్తాడు. ఇందులో ఒక రహస్యం ఇమిడి వుంది. ముందే మనం చెప్పాకున్నాం. తన ప్రతి కదలికలో, నడవడికలో లోకానికో సందేశం చాటాడని.

ఇక్కడ- సమాన వయస్కుల దగ్గర, స్నేహితుల దగ్గర మాత్రం తన శక్తియుక్తులు చెప్పుకోవచ్చుగాని, పెద్దల దగ్గర మాత్రం తగురీతిలో విధేయతా వినమ్రతలతో- ఆచి తూచి మాట్లా

డాలి. అలాంటప్పుడే వారి ఆదరాభిమానాలూ, ఆశీస్సులూ వీరికి లభిస్తాయి. అంతర్గతంగా వారి శక్తి వీరిలో ప్రవేశిస్తుంది. అలాకాక పెద్దల సమక్షంలో గొప్పలు చెప్పుకుంటే- వారు దానిని 'అహంకారం'గా భావించే అవకాశం లేకపోలేదు. వారి ఆగ్రహానికి గురి కావలసి వస్తుంది. తన వీర్యం నిర్వీర్య మవుతుంది. అదీ ఇచట గమనింపవలసిన సందేశం

## ఆంజనేయుని. లంకానగర శోధనా వివరణ

నగరానికి సమాయత్తమవుతూ రాముడు— "ఆంజనేయా! లంకా నగరాన్ని రాక్షసులెలా రక్షిస్తున్నారు. వారి బలగం, ఆయుధ సంపత్తి ఎంత? వివరంగా చెప్ప" మనగా-

హృష్టా ప్రముదితా లంకా మత్తద్విప సమాకులా
మహతీ రథ సంపూర్ణా రక్షో గణ సమాకులా.
వాజిభిశ్చ సుసంపూర్ణా సా పురీ దుర్గమా పరైః
దృఢబద్ధ కవాటాని మహా పరిఘవంతి చ.

"రామా! లంకానగర వైభవం వర్ణనాతీతం. ఆ నగరవాసులు చీకూ చింతాలేనివారు. కడుపులోని చల్ల కదలకుండా సుఖమయ జీవనయానం సాగిస్తున్నారు. సలలిత రాగ సుధారస గానాలతో- సర్వ కళామయ నాట్యవిన్యాసాలతో విరాజిల్లే లంకా పట్టణం- వేనవేల రథాలతో, ఏనుగులతో, గుఱ్ఱాలతో అలరారే స్వర్ణమయి.

ఇక యీ లంకా నగరానికి నలుదిక్కులగా నాలుగు ద్వారాలు. వాటికి అభేద్యమైన కవాటాలు. వాటికి రాళ్ళూ, బాణాలూ వర్షించే యంత్రాలు, బల పరాక్రమాలుగల సాయుధపాణుల కాపలా. ఆ నగర ప్రాకారం బంగారుమయం. ప్రాకారాన్ని చుట్టుముట్టిన

అగడ్త. నిరంతరం నిండుగా ప్రవహించే నీరుగల అగడ్తలవి. లంకా ప్రవేశ నిర్గమాలకు నలువైపులా వేలాడే వంతెనలు- వాటిని వాల్చటానికీ, ఎత్తటానికి యంత్రాలు, ఇది శత్రు దుర్భేద్యం.

నేను ఆ నాలుగు వంతెనలను విరగగొట్టాను. అగడ్తలను నామరూపాలు లేకుండా పూడ్చివేశాను. ప్రాకారం రూపురేఖలు లేకుండా చేశాను. భవనాలన్నీ భస్మీభూతం చేశాను. ఇక మన ముందున్న తక్షణ కర్తవ్యం సముద్రాన్ని దాటడం" అన్నాడు ఆంజనేయుడు

ఇచట హనుమాను బుద్ధి వైభవం గమనింపతగినది. తాను లంకా పరిసరాలను పరీక్షగా పరికించాడు. సామ, దాన, భేదోపాయాలకు లొంగని రాక్షసులను అశోకవన ధ్వంసంతో వారిపై దండోపాయం ప్రయోగించాడు. లంకానగర రహస్యాలు కనుగొన్నాడు. పూర్తి అవగాహనతో గుర్తు పెట్టుకున్నాడు. అవసర సమయాన వినియోగించుకున్నాడు. ముందుచూపు కలిగినవాడు కాబట్టి భావికాలాని కనుగుణంగా ప్రవర్తించి ఉత్తమ దూతగా రామునిచే ప్రశంసింపబడినాడు.

కారణాంతరాల వలన మనం ఏదైనా సరిక్రొత్త తావునకు వెళ్ళుట జరిగితే- ఆ ప్రదేశం పూర్తి సమాచారాన్ని, అచటివారిని మంచి మాటలతో అలరించి తెలుసుకోవాలన్నమాట. అవసరమైనంతమట్టుకే కొందరి ప్రవర్తన ఉంటుంది. అలా చేయరాదు. దీర్ఘదర్శివలె ఆ ప్రాంతపు టానుపానులను పూర్తిగా గ్రహించగలగాలి.

## విభీషణ శరణాగతి - ముందు చూపు

లంకా నగరాన రావణునితో "యుద్ధము తగదని, సంధి చేసు కొమ్మని, అన్నీ అశుభ శకునాలే కనిపిస్తున్నాయని" తన శక్తి వంచన లేక ఎంతగానో సమరము నాపనెంచిన విభీషణునికి తిర స్కారావమానాలే ఎదురుకాగా- తన సహచరులతో రాముడున్న తావునకు వచ్చి శరణు వేడినాడు. సుగ్రీవాది వానర వీరులు. విరోధి సోదరుడు కాన ఇతనికి శరణ మిచ్చుటకు ఇది తగిన సమ యము కాదని తమ తమ వాదనలను వినిపించగా- ఆంజనేయుడు విభీషణుని అంతరంగాన్ని అవలోకించి అరి వర్గమునకు చెందిన వాడైనా ఇతని హృదయం ధర్మబద్ధం. ఇతనిలో ఏదోషం లేదు. ఆశ్రయమీయ తగునని నయబుద్ధితో వివరించి శ్రీరామునికి అత్యంత ప్రీతిపాత్రుడయినాడు.

గతాన్ని నెమరువేస్తూ, వర్తమానాన్ని చూస్తూ, భావిని ఊహించగలవాడే భవిష్యత్తులో సుఖసంతోషాల నందగలడు. సలహాల నిచ్చువారు తమ యజమానులకు మేలు జరుగురీతిన ప్రజ్ఞా పాటవాలతో భవిష్యత్కాలాన్ని దృష్టిలో ఉంచుకొని బాగో గులు విచారించి సలహా, సంప్రతింపులు జరిపిననాడు అటు యజ మాని సత్ఫలితాల నందగలడు. ఇటు ఆ సేవకునిపై యజమానికి గౌరవభావం ఇనుమడించును. ఇచట బుద్ధి విశేషం ప్రధానం. స్వార్థమే లేని పరార్థం ప్రధానం. నేటికాలాన ముఖ్యంగా కీలక మైన పదవులలో నున్నవారు అంజనేయుని ధీవైభవాన్ని ఏకొంచెం గ్రహించినా ప్రభుత పడిపోదు. తిరోగమన పథంవైపు సాగదు. ప్రగతిపథాన నడుస్తుంది. ఎటుచూచినా స్వార్థం, స్వార్థం,స్వార్థం తప్ప పరార్థం కానరాదే. చూడండి హనుమ అందరివలెకాక రాబోవు రామ, రావణ యుద్ధంలో శత్రువుల రహస్యాలు, వారి

జవజీవ రహస్యాలన్నీ తెలిసిన విభీషణుని అవసరం ఎంతో ఉం దని గ్రహించిన ప్రాజ్ఞుడు కాననే శరణమీయ తగునని సలహా ఇచ్చినాడు. ఈ సన్నివేశం దృష్టిలో ఉంచుకొనే ఏమో!! "ఇంటి గుట్టు లంకకు చేటు" అన్న సామెత వచ్చియుండును.ఎదుటివాని మనసును గ్రహింపగలది ఒక్క బుద్ధి విశేషమే. అది హను మంతునికి వెన్నతో పెట్టిన విద్య. బుద్ధి వైభవాన్ని తెలిపే ఒక పద్యం మన సాహిత్యంలో ఉంది. గమనించండి.

వాయువు దూరని చోటను
తోయజ బాంధవుని రశ్మి దూరని చోటన్
ధీయుతుల బుద్ధి దూరు ని
రాయాసంబునను కార్యమగు తద్బుద్ధిన్.

## సద్వర్తనము వదలక యుండిన మనుజుడు పూజ్యుడు జన సమాజమునన్

సేతువు నిర్మించి, సముద్రం దాటి ఆవలితీరం చేరి యుద్ధ సన్నద్ధులై చివరిసారిగా రావణునికి హితవు చెప్పటకై - రాముడు అంగదుని రాయబారిగా పంపినాడు. అంగద రాయబారం విఫల మైంది. వానరసేన రాక్షసులను ఢీకొంది. పోరు భీకర రూపం దాల్చింది. ధూమ్రాక్ష, వజ్రదంష్ట్ర, అకంపన, ప్రహస్తాది రాక్షస వీరులు రాము నెదిరించి అసువులు బాసారు. కుంభకర్ణుడు కుంభినీ ధవుని చేరాడు. ఇంద్రజిత్తు మాయా యుద్ధం ప్రారంభించాడు. బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. రామ, లక్ష్మణ, సుగ్రీవ, అంగద, జాంబవంతాది వానర, భల్లూక వీరులు మూర్ఛితులయ్యారు. వానర సైన్యంలో ఇరువురుని మాత్రమే బ్రహ్మాస్త్రం కట్టడి చేయ లేక పోయింది. ఆ ఇరువురూ విభీషణ, అంజనేయులు. వారు

ఆహవరంగం అంతా కలయతిరుగుతూ- "యీ పరిస్థితినుండి తమ వారి నెలాగ తప్పించాలి" అని ఆలోచిస్తున్నారు. ఇంతలో జాంబ వంతుని సమీపించారు. విభీషణుడు జాంబవంతుని "తాతా! ఎలా ఉన్నావు" అన్నాడు.

"విభీషణా! నా శరీరం బాణాహతికి దెబ్బతిన్నది. చూపు మందగించింది. చూడలేకున్నాను, నీ స్వరాన్నిబట్టి గుర్తించాను. అంజనేయునికి క్షేమమా?" అన్నాడు.

భల్లూకరాజు మాటలు విభీషణుని ఆనందాశ్చర్యాలకు లోను చేసినవ్.

రామ లక్ష్మణులనో- సుగ్రీవునో- అంగదునో అడుగక అంజ నేయుని క్షేమం విచారిస్తున్నావేమి రాజా! అనగా—

**అస్మిన్ జీవతి వీరోతు హతమప్యహతం బలం**
**హనూమత్యుజ్ఞిత ప్రాణే జీవనోపి మృతావయం.**

**ధరతే మారుతిస్తాత మారుత ప్రతిమోయది**
**వైశ్వానర సమో వీర్యే జీవితాశా తతో భవేత్.**

విభీషణా! ఆంజనేయుడు జీవించియున్న- వానర వీరులం దరూ మరణించిననూ జీవించియున్నట్లే. పావని పరమపదించిన- అందరం జీవించి ఉన్నా జీవచ్ఛవాలమే. వాయువేగము గలవాడూ, పరాక్రమంలో అగ్నిసముడూ అంజనా నందనుడు.

అదేసమయానికి అచటికి చేరుతున్న పావని—

**తతో వృద్ధ ముపాగమ్య నియమే నాభ్యవాదయేత్**
**గృహ్య జాంబవతః పాదౌ హనుమాన్ మారుతాత్మజః**

తనపై ప్రగాఢ విశ్వాసముంచిన జాంబవంతుని పాదద్వయమును నంటి శిరము వంచి నమస్కరించాడేగాని పొగడ్తగా భావించి అహంకరించలేదు. గర్వమెరుగని వినయవంతుడు. ఆడంబర మెఱుగని నిరాడంబరుడు. ఇంతటి మన్నన పొందిన హనుమ వినయం ప్రధానం అన్న సందేశం ఇచ్చాడు జగానికీ సన్నివేశంలో. దీనిని వివరించే ఒక చక్కని సుభాషితం మనకుంది. ఆచరించి చూపండి.

తన నడవడి సత్పురుషులు
కొనియాడగ నుబ్బకదియ గుణముగ దద్వ
ర్తనమున్ వదలక యుండిన
మనుజుడు పూజ్యుండు జన సమాజములోనన్

ఆంజనేయుడు జాంబవంతుని దేహాన్ని కరముతో నిమిరాడు. ఆ కరస్పర్శ జాంబవంతుని అస్త్రబాధ తొలగించింది సంతోషంతో-

"హరి శార్దూలా! ఆ గచ్ఛ. ఈ తరుణంలో వానరులను నీవే కాపాడాలి. హిమగిరి ఆవలగల కైలాసగిరిలో సంధానకరణి, సువర్ణకరణి, సంజీవని అదిగా గల ఓషధులున్నవి. తక్షణం పతిత జనావనులను కాపాడ- వానిని తీసుకురమ్ము" అనగా-

మరుక్షణం గగనాని కెగరిన హనుమ అద్భుతంగా క్షణాలలో చక్రాయుధుడైన చక్రపాణిలా వజ్రాయుధధారి శచీనాథునిలా గిరినే ధరించి నేలకు దిగాడు. ఆ ఓషధుల గాలి తగలగనే- స్పృహలోనికి వచ్చారు వానర వీరులు. మారుతి ఆ గిరిని పని పూర్తికాగనే యథాస్థానంలో ఉంచి వచ్చాడు.

ఇలాగే మరోసారి లక్ష్మణస్వామి మూర్ఛితుడు కాగా కైలాస గిరిని తెచ్చి లక్ష్మణుని పునరుజ్జీవితుని చేశాడు. స్వామివారి నామా

లలో "లక్ష్మణ ప్రాణదాతా చ" అని ఉన్నది. ఈరీతిగా సమ రాంగణంలో వానరసేనను కంటికి రెప్పలా కాపాడిన అతులిత బలధాముడు.

యుద్ధరంగాన ఎందరో రాక్షస వీరులను మట్టి కరపించిన ఆంజనేయుడు మహాకాలునివలె విజృంభించినాడు. "ఆహా! ఏమి నీ శౌర్యము. నేటికిగదా నాకు సరిజోడు లభించినది" అని మెచ్చుకుని ఎదిరించిన రావణుడే- యీ మహాబల పరాక్రమవంతుని ముందు నిలబడలేక మర్యాదగా తప్పుకున్నాడు. ఇక అని లాత్మజుడును రాముని చేతిలోనే 'రావణుని మరణ' మన్న విధిని తలచి వదలివైచినాడు.

సమర రంగాన అసువులు వీడాడు రావణుడు. యుద్ధము ఆగినది. ఈ వార్తను ముందుగా జనకసుతకు వినిపించి ఆనందాన్ని చేకూర్చింది మారుతియే. ఆమె "ఆంజనేయా! నేడు మంగళవారము. ఈరోజు రావణుని మరణవార్త వినిపించి నాకు సంతోషాన్ని కలిగించావు కాబట్టి నేటినుండి యీ వారాన్ని జయవారం అంటారు. ఎవరైతే యీరోజు గంగ సింధూరం అద్ది నిన్ను భక్తి శ్రద్ధలతో పూజిస్తారో- వారికి కార్యసిద్ధి కాగలదు" అని ఆశీర్వదించింది. మంగళవారం ఆంజనేయునికి ప్రియమైన రోజు.

## ఆంజనేయుని అదృష్టం

రామప్రభు రాగను మొదటగా భరత, శత్రుఘ్నులకు వినిపించినదియు మారుతియే. యీవిధంగా రఘువంశానికి ఆనంద హేతువైన వార్తల నందించి ఆ వంశాన్ని కాపాడినవాడు మారుతాత్మజుడు.

రామ పట్టాభిషేక సమయంలో 'గుర్తింపు' పొందిన వారికి సన్మాన సత్కారాలు నేత్రోత్సవంగా జరిగాయి. సన్మానితులు సంతోష తరంగాల తేలియాడారు. అందరికీ అన్ని సత్కారాలు

జరిగాయి. రామాయణ మహామాలా రత్నమైన హనుమంతునికి దప్ప. ఇది సభలో గుసగుసలకు తావిచ్చింది. కారణం తనుకొ్ర లేకపోయారు తన సర్వస్వం ప్రభుసేవకే అంకితం చేసిన మారుతి ఎవరి గుర్తింపూ పొందలేకపోయాడే! ఇదేమిటి చెప్మా!!! ఇదే అందరి హృదయాల ప్రశ్నార్థకం.

ఇంతలో రాముడు జనకరాజ నందినికి ఒక అమూల్య ముత్యాల హారం ఇచ్చి "జానకీ! ఈ హారాన్ని నీ అభిమాన పాత్రుడైన సేవకున కర్పించ' మన్నాడు సభలో ఇంత వేడుక జరుగుతున్నా మారుతి జితేంద్రియుడై శ్రీరామచంద్రుని దివ్య పాదారవిందాలనే చూస్తూ తదేకంగా ఉన్నాడు. ఈ గౌరవ పురస్సరాలతో తనకు పనిలేదు. ఇవన్నీ తన స్వామి పదసేవ ముందు దిగదుడుపే. హారాన్ని చేతపట్టి సీతామాత చిరునగవుతో వాతాత్మజుని గళసీమ నలంకరించింది. కృతజ్ఞతాంజలి బద్ధుడై మారుతి సీతారాములకు నమస్కరించినాడు.

"స్వయముగా సీతామాత తన కర కమలములతో శిరమున వైచినదీ ముత్యాల హారం. మారుతి ఎంత అదృష్టవంతుడో కదా!" అని సదస్యులు మిన్నుముట్టే కరతాళ ధ్వనులతో సంతోషాన్ని ప్రకటించారు. ప్రత్యేకంగా మారుతి నింతగా సమ్మానించినా-సుంతయినా అతిశయించలేదు.

మారుతి కార్యసాధకు డెటులుండవలెనో ఆచరించి చూపాడు. కార్యసాధకునకు- అచంచల ఆత్మ విశ్వాసం, పట్టుదల, నిరంతర కఠోర పరిశ్రమ, సంయమనము, ఏకాగ్రత, త్రికరణశుద్ధి, స్వార్థ రాహిత్యము- మొదలగు సద్గుణాల నలవరచుకోవాలి. మిన్ను

విరిగి మీదపడినా ధైర్యం కోలుపోరాదు. ఉత్సాహం వీడరాదు. ఆవేశం అసలే పనికిరాదు. రోషం వదలాలి. లక్ష్యం మీదనే దృష్టి కేంద్రీకరించాలి. ఇవన్నీ ఆచరణలో చూపిననాడు అత్యద్భుత విజయాలు సాధించవచ్చు. ఇట్టి కార్యసాధకుడు ఎవరెస్టు శిఖరాన్ని అందుకోగలడు. ఇహ పరాలలో సన్మానితుడు కాగలడు. తనంత తానుగా అష్టలక్ష్మి- అష్ట ఐశ్వర్యాల నిచ్చును. పై సద్గుణ సంపత్తి నలవరచుకోనివాడు అవమానాలపాలై నలుగురిలో చిన్నబోవును.

## త్యాగే నైకే అమృతత్వ మానశః

ఆంజనేయుడు నవ వ్యాకరణవేత్త. శబ్ద బ్రహ్మ, రామనామ రసాస్వాదన తత్పరుడు. రామ చరిత్రను సమయము దొరికినపుడెల్లా తాను నడయాడు పర్వత శిలాఫలకాలపై రచించుచుండెడివాడు రామాయణం పూర్తిగా పర్వత శిలలపై రూపు దిద్దుకున్నది. వారి రచనలో శబ్దార్థాలు సరసంగా, సుమధురంగా అపాత మధుర- ఆలోచనామృతాలుగా సాగినై. పాఠకుల మనోఫలకాలపై సీతారాముల గాథ చెరిగిపోని- మాసిపోనిరీతిగా ముద్రింపబడేటట్లు రచన సాగింది.

మారుతాత్మజుడు రామాయణ రచన పూర్తి చేశాడన్న వార్త కర్ణపరంపరగా వాల్మీకి మహామునికి తెలిసింది. అప్పటికే ఆ మహర్షి శ్రీమద్రామాయణాన్ని ఆదికావ్యంగా మలచాడు. సామీరిని చేరి ఒకసారి తాను రాసిన రామాయణాన్ని చూపవలసినదిగా కోరాడు. వీతరాగుడైన మారుతి రాళ్ళపై తాను రాసిన రామకథను చూపుతాడు. ఆ శబ్దాల పొందిక, ఆ భావ సంపద, రచనా రమణీయకత ఆదికవిని ఆశ్చర్యంలో ముంచెత్తినవి,

అంజనా నందనా! నీ రచన అనితరసాధ్యం. నీ రామగాథ ముందు నా రామాయణం సూర్యుని ముందు దివిటీ. కీర్తికాంక్షినై నేను చేసిన నా రచన వృథాయగునేమో! అని ఏమేమో పల్కు వల్మీకభవునితో పావని—

"మహర్షీ! మీరు చింతించవలసినది లేదు. ఈ నదీనదాలు-పర్వతాలవలె యీ జగాన మీ రామాయణమే శాశ్వతంగా నిలుస్తుంది" అంటూ తాను వ్రాసిన ఆ కొండరాళ్ళను వాల్మీకి చూచుచుండగనే సముద్ర జలాలలోకి దొర్లిస్తాడు. ఇక నా రామకథ ఎవరికంటా పడదు. నీ రామాయణమే అందరి నాల్కలపై నిలుస్తుంది అని చెప్పగా—

వాల్మీకి నిరుత్తరుడై- "వాయుకుమారా! నీ నిర్మల కీర్తి ఆచంద్ర తారార్కం నిలచి ఉంటుంది. నీ త్యాగబుద్ధి నిరుపమానం" అని ప్రశంసిస్తాడు.

'త్యాగే నైకే అమృతత్వ మానశుః' త్యాగంతోనే అమృతత్వం సిద్ధిస్తుంది. త్యాగ నిరతితో యీ స్వామి చేసిన కార్యం ఎంతటి ఉదాత్త ఉదాహరణో! కీర్తికాంక్షలు తన లక్ష్యాన్ని దూరం చేస్తాయి. త్యాగ బుద్ధి గమ్యస్థానం చేరుస్తుంది.

నీటిని యీదునపుడు- నీటిని వెనుకకు తోస్తూ ముందుకు పోతాం. అలానే స్వార్థాహంకార, మమకారాలను నెట్టివేస్తూ త్యాగ బుద్ధితో ముందుకు సాగి పరమపద సోపానాన్ని అందుకోవాలి. అదే పురుషార్థం. అది సాధించాలంటే- పావని పరమ చరితం అవశ్య పఠనీయం. ఆచరణకు అనువైనది.

స్వామి వివేకానందుడు- నేటి సమాజానికి హనుమన్మూర్తిని ఆదర్శంగా తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉందని ఇలా

అంటారు. "భగవద్భక్తి వల్ల పుట్టే త్యాగమే లక్ష్యంగా పెట్టుకుని సింహబల సాహసాలతో, దూషణల వంటి వికారాలకు అతీతులై, కర్మ ఫలాకాంక్షను వదలి- కార్యరంగంలో దుముకాలి ఇదే భారత జాతీయ ధర్మం. దీనికి ఉదాహరణ ఆంజనేయస్వామి. ఆ హనుమన్మహావీరుడే మనకి ఆదర్శ పురుషుడు.

జితేంద్రియ చక్రవర్తి, అద్వితీయ ధీశాలీ, రామనామంపై ఉన్న అఖండ భక్తితో ప్రాణభీతిని విడనాడి ఒక్క దుముకులో సాగరాన్నెలా లంఘించాడో చూడండి. ఆయన ఎంతటి భగవత్సేవకుడో! ఎంతటి ఆదర్శమూర్తో !!

తన అఖండ బాహుబలంతో, అద్వితీయ పరాక్రమంతో రావణుని రాక్షస సైన్యాలను హాహాకార మెత్తించగలిగిన మహా వీరుడతడు. మరోవైపున రామపద పంకజార్చన చేసే భక్తులలో అద్వితీయుడు కూడా ఆతడే. అటువంటి నిశ్చలమైన భక్తియే దేశానికిప్పుడు అత్యవసరం !!!

కాన ఓ చదువరులారా! ఆంజనేయుని మనసారా స్మరించుచూ- ఆ పావని చూపిన బాటలో పయనించుచు సంపూర్ణ ఆయురారోగ్య భోగ భాగ్యాలతో- మీ జీవితాలను వసంతయామిని వోలె గడుపుకోవాలనీ, మిమ్ములను సదా వెన్నంటి మారుతాత్మజుడు కాపాడుగాత యని కోరుతూ —

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వమరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్.

స్వస్తి.

# శ్రీ సూక్త పురుష సూక్త విధానేన సువర్చలా సమేత హనుమద్దేవతా షోడశోపచార పూజా విధానం

ప్రదీప్త స్వర్ణ వర్ణాభం బాలార్కారుణ లోచనం ।
స్వర్ణమేరు విశాలాంగం శతసూర్య సమప్రభం॥

రక్తాంబర ధరాసీనం సుగ్రీవాదియుతం తథా ।
గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం ॥

పుచ్ఛవస్త్రం కపీశం తం మహారుద్రం భయంకరం ।
జ్ఞానముద్రాలసద్బాహుం సర్వాలంకార భూషితం ॥

ధ్యానస్య ధారణాదేవ విఘ్నాన్ముక్త స్సదానరః ।
త్రిషులోకేషు విఖ్యాతః సర్వత్ర విజయీభవేత్॥

త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ ।
హనుమన్ యత్నమాస్థాయ దుఃఖక్షయ కరోభవ ॥

(ఇంతవరకు చేతులు జోడించి స్వామివారి ఎదుట నిలచి ప్రార్థించవలెను.)

శ్రీ హనుమన్ జయ హనుమన్ జయ జయ హనుమన్
అంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం ।
బాలార్క సదృశాభాసం రామదూతం నమామ్యహం ॥

ఓం నమో భగవతే వాయు నందనాయ.

(ఐదుసారులు ప్రదక్షిణ చేసి నమస్కరించి, దీపారాధన చేసి కూర్చుని పూజావిధానము మొదలు పెట్టవలెను.)

ఆచమనం :-

ఓం కేశవాయ స్వాహా ।
ఓం నారాయణాయ స్వాహా ।
ఓం మాధవాయ స్వాహా ।

అని ముమ్మారు ఆచమించవలెను. గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహ, అచ్యుత, జనార్దన, ఉపేంద్ర, హరేః, శ్రీకృష్ణాయ నమః.

భూతోచ్చాటన - ప్రాణాయామము :-

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః యేతే భూమి భారకాః ।
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥
భూతగ్రహపిశాచాది విఘ్నకర్తృ నివారణం ।
సకృన్మంత్రం సముచ్చార్య ఆసనం పరికల్పయేత్ ॥
భూమ్యాదేః ఊర్ధ్వలోకస్య ఉపరిష్టా దివాకరః ।
దశప్రణవ సంయుక్తం త్రిరావృత్యా పునః పునః ॥
అంగుళ్యగ్రైః నాసికాగ్రం సంపీడ్యం పాపనాశనం ।
ప్రాణాయామమిదం ప్రోక్తం ఋషిభిః పరికల్పితం ॥
(అని భూతోచ్చాటనము చేసి ప్రాణాయామము చేయవలెను.)

సంకల్పము :-

శుభాభ్యాం, శుభే, శోభనే, ముహూర్తే, శ్రీ మహావిష్ణోరాజ్ఞేయా, ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూ

ద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణే దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే, కృష్ణా కావేర్యోః మధ్యప్రదేశే,సమస్త బ్రాహ్మణ హరిహర సన్నిధౌ—

అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన—(సంవత్సరం పేరు) నామ సంవత్సరే— (ఏ ఆయినం) అయనే— (ఏ ఋతువు) ఋతౌ— (ఏ మాసం) మాసే — (ఏ పక్షమో) పక్షే — (తిధి పేరు) తిథౌ — (వారం పేరు) వాసరే శుభ నక్షత్రే, శుభ యోగే,శుభకరణ,ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ—

శ్రీమాన్ శ్రీమతః — (గోత్రం పేరు) గోత్రస్య — (తన పేరు చెప్పుకోవాలి) నామధేయస్య ధర్మపత్న్యా సహ సహ కుటుంబానాం క్షేమ స్థైర్య విజయ అభయ ఆయుః ఆరోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం- ధర్మ అర్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిధ్యర్థం-

జన్మ లగ్నవశాత్-జన్మరాశివశాత్- ఏఏ గ్రహాః- అరిష్టస్థానేషు స్థితాః- తేషాం గ్రహాణాం- తత్త దరిష్ట స్థానం పరిత్యజ్య- శుభ స్థాన స్థిత అత్యంత అతిశయ శుభఫలావాప్త్యర్థం, మమ కుటుంబానాం (యజమానస్య) పశు శిశు ఆశ్రిత బంధుమిత్రైస్య స్సహ సకల దుష్టగ్రహ బాధా నివారణార్థం భూమ్యంతరిక్ష దివ్య మహోత్పాత దుర్నిమిత్తాద్భుత దర్శనాది సర్వారిష్ట శమనపూర్వక పరకీయ మంత్ర యంత్ర తంత్ర విషశల్య మూలికా చూర్ణ ప్రయోగాద్యభిచారదోష శాంత్యర్థం- మమ శరీరే అస్థిగత, మాంసగత, రక్తగత, రోమగతాది బాధీకృత సర్వరోగ ప్రశమనద్వారా శీఘ్రమేవ సంపూర్ణ ఆరోగ్య సిద్ధ్యర్థం- శత్రుబాధా నివారణార్థం- రాజ

ద్వారే-రాజముఖే-అస్మత్ సంచారస్థ సర్వత్ర సర్వస్థలేషు- నిర్వి ఘ్నతాపూర్వక ఆచరిత సకల కార్యసాధనేన అఖండ దిగ్విజయ సిద్ధ్యర్థం- మనోవాంఛా ఫల సిద్ధ్యర్థం- నిరంతర సుఖ సంతోషాది మనోల్లాస సిద్ధ్యర్థం-

శ్రీ సువర్చలాసమేత హనుమత్ దేవతాం ఉద్దిశ్య శ్రీ సువర్చలా సమేత హనుమద్దేవతా ప్రీత్యర్థం- సంభవద్భిః ద్రవ్యైః సంభవద్భిః ఉపచారైః సంభవితా నియమేన శ్రీసూక్త పురుష సూక్త విధానేన కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే-

(ఇపుడు గణాధిపతిని పూజించి- యథా స్థానమునకు పంపి- ఇక సువర్చలా సమేత హనుమద్దేవుని పూజించవలెను. ఆచమనము, ప్రాణాయామము మళ్ళీచేసి-)

తదంగ కలశారాధనం కరిష్యే.... కలశే గంధ పుష్పాక్షతైః అభ్యర్చ్య- కలశస్యోపరి హస్తం నిధాయ- (అంటూ-

కలశమునకు గంధమును- కుంకుమను- అలంకరించవలెను. కలశములో గంధపుష్ప అక్షతలను వేయవలెను. బొటనవ్రేలు మడచిన అరచేతిని కలశముపై ఉంచి-—)

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్మృతాః ॥
కుక్షౌ తు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥

మం॥ ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే।

ఆపోవా ఇదగ్ంసర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః

పశవ ఆపో౽న్నమాపో౽మృతమాప స్స్వరాడాప శ్ఛందాగ్
స్యాపో జ్యోతీగ్ష్యాపో యజూగ్ష్యాప స్సత్యమాప స్సర్వా
దేవతా ఆపో భూర్భువ స్సువరాప ఓం॥

శ్లో॥ గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥

అయాంతు శ్రీ ఉద్దిష్ట సమస్త దేవతాసహిత- సువర్చలా సమేత హనుమద్దేవతా పూజార్థం మమ దురితక్షయకారకాః- కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య దేవం సంప్రోక్ష్య ఆత్మానం సంప్రోక్ష్య— (తమలపాకుతో కలశములోని నీటిని పూజా ద్రవ్యాలపై దేవునిపై తనపై, ప్రక్కన భార్యఉంటె ఆమెపై చల్లుకోవాలి)

ప్రతిమా శోధనం :- పంచామృతాలతో—

ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం
భవావాజస్య సంగధే — పాలతో
దధిక్రావణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్సవాజినః
సురభినో ముఖాకరత్ ప్రణ ఆయూగ్ంషితారిషత్
— పెరుగుతో

శుక్రమసి జ్యోతిరసి దేవో పవిత్రేణ వస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణవసో సూర్యస్య రశ్మిభిః. — నేతితో

మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః
మాధ్వీర్నస్సంత్వోషధీః మధునక్తముతోషసి
మధుమత్ పార్థివగ్ం రజః మధుద్యౌరస్తునః పితా
మధుమా౽న్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః
మాధ్వీర్గావో భవంతు నః. — తేనెతో

తాశ్శర్కరా అభవన్ తచ్ఛర్కరాణాగ్ం శర్కరత్వం
వజ్రోవైశర్కరాః ప్రశురగ్నిర్యచ్ఛర్కరాభిరగ్నిం పరిమినోతి
వజ్రేణైవాస్మై పశూన్ పరిగృహ్ణాతి తస్మాద్వజ్రేణ పశవః
పరిగృహీతాః తస్మాత్స్రేయాన స్త్రేయ సోనోపహరతే
త్రిసప్తాభిః పశుకామస్య — పంచదారతో
యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచత్వగ్ం హసః
— కొబ్బరినీటితో

గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధుకావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు
కావేరీ తుంగభద్రాచ కృష్ణవేణ్యాచ గౌతమీ
భాగీరథీచ విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః
— మంచినీటితో

**తరువాత పరిమళోదకంతో**

సువర్చలాసమేత హనుమద్దేవతా ప్రతిమాం పరిమళోదకేన స్నాపయామి. తరువాత ప్రతిమను పరిశుభ్రమైన వస్త్రముతో తుడువవలెను.

గంధద్వారాందురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం.
గంధాన్ ధారయామి అని ప్రతిమకు **గంధం** అద్దవలెను.
అయనేతే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే.
గంధంపై **గంగసింధూరం** అద్దాలి.
అంజనాగర్భ సంభూత కపీంద్ర సచివోత్తమ
రామదూత నమస్తుభ్యం హనుమాన్ రక్ష సర్వదా

అంటూ అలంకరించిన ప్రతిమను తమలపాకులో పెట్టి కలశానికి ప్రక్కన ఉంచాలి.

ప్రాణ ప్రతిష్ఠ :-

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో దేహి భోగం జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరంత మనుమతే మృడయాన స్వస్తి, అమృతం వై ప్రాణ అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే.

ఓం మాం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం హంసస్సోహం ఆంజనేయ యంత్రప్రాణా ఇహ ప్రాణా ఆంజనేయ యంత్రస్య సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణానీ హైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా.

అంటూ తమలపాకును నీటిలో తడిపి పట్టుకుని చేతిని చాపి కలశం, ప్రతిమలపై ఉంచవలెను.

సువర్చలా సమేత హనుమతే నమః, స్థిరోభవ వరదోభవ సుముఖోభవ సుప్రసన్నోభవ. మమ అభిముఖోభవ. స్థిరాసనం కురు.

అథ ధ్యానం :-

అథ ధ్యాయేత్కపి శ్రేష్ఠం చతురాభరణాన్వితం ।
వామభాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలాం ॥
పశ్యంతీం స్నిగ్ధయా దృష్ట్యా స్మితవక్త్ర ముఖాంబుజం ।
ఛత్ర చామర సంయుక్తం వినతాద్యైస్సు సేవితం ॥
ముక్తాహార గణోపేతం రత్నకుండల భూషితం ।
గ్రైవేయ భూషితగ్రీవం కనకాంగద ధారిణం ॥
నానామణి సముత్కీర్ణం కిరీటోజ్వల శేఖరం ।
మేఖలాదామ సంవీతం మణినూపుర శోభితం ॥

రక్తకంకణ విద్యోతి పాణిరక్తాంబుజ ద్వయం ।
కథిత స్వర్ణవర్ణాంగం ఉష్ట్రధ్వజ సమన్వితం ॥
పద్మాసనే సమాసీనం పీతాంబర సమన్వితం ।
చతుర్భుజధరం శాన్తం సర్వవ్యాపిన మీశ్వరం ॥
సర్వదేవ పరీవారం సర్వాభీష్ట ఫలప్రదం ।
ఆవాహయామి సర్వేశం సూర్యపుత్రీప్రియం విభుం ॥
అంజనా తనయం దేవం మాయాతీతం జగద్గురుం ।
ఏవం ధ్యాత్వా హనూమంతం పూజయేత్ శుద్ధ మానసం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- ధ్యాయామి.ధ్యానం సమర్పయామి అంటూ అక్షింతలను స్వామివారి పాదాలపై ఉంచి నమస్కరించాలి.

ఆవాహనం :-

ఆవాహయామి పింగాక్షం మహావీర్యం మహాబలం ।
వాయుసూనుం రామభక్తం లంకానిర్మూల కారణం ॥

ఓం సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్ ॥
ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః। ఆవాహయామి ఆవాహనం సమర్పయామి అంటూ అక్షతలను వేయాలి.

ఆసనం :-

రత్నసింహాసనం చారు జాంబూనదమయం శుభం ।
ప్రీత్యర్థం తవ దాస్యామి సంగృహాణ ద్రుతం ప్రభో ॥

పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం ।
ఉతామృతత్వస్యేశానః యదన్నేనాతి రోహతి ॥

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీం ।
యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః. నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి. సింహాసనార్థం అక్షతాన్ సమర్పయామి.

అక్షతలు, పూలు, గంగసింధూరం వీన్నిలో ఏదొకటైనా స్వామివారి పాదాలచెంత ఉంచాలి.

పాద్యం :-

పాద్యం దదామ్యహం భక్త్యా నిర్మలం పావనం శుభం ।
గృహాణ వానరాధీశ సుగ్రీవప్రియ బాంధవ ॥

ఏతావానస్యమహిమా అతోజ్యాయాగ్శ్చ పురుషః ।
పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి ॥

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీం ।
శ్రియం దేవి ముపహ్వయే శ్రీర్మాదేవి జుషతాం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః పాదయోః పాద్యం సమర్పయామి స్వామివారి పాదాలపై నీటిని చల్లాలి.

అర్ఘ్యం :-

అర్ఘ్య మష్టాంగ సంయుక్తం శుభ్రం తే ప్రదదామ్యహం ।
గృహ్యతాం కరుణాసింధో పీతవస్త్రం ప్రసీద భో ॥

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోస్యేహా భవాత్పునః ।
తతోవిష్వఙ్వ్యక్రామత్ సాశనానశనే అభి ॥

కాంసోస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం
తృప్తాం తర్పయంతీం ।
పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః- హస్తయోః అర్ఘ్యం సమర్ప యామి. స్వామివారి చేతులపై నీటిని చల్లాలి.

ఆచమనీయం :

వాసితగ సర్వతీర్థేభ్యః ఆనీతం శీతలం శుభం ।
దదామ్యాచమనార్థం తే గృహ్యతా మంజనాసుత ॥
తస్మాద్విరాడజాయత విరాజో అధిపురుషః ।
స జాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః ॥
చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం యలోకే
దేవజుష్టా ముదారాం ।
తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేఽలక్ష్మీర్మేనశ్యతాం
త్వాం వృణే ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- ముఖే ఆచమనీయం సమర్పయామి. స్వామివారి మూతి దగ్గర ఒక ఉద్ధరిణె నీటిని ఉంచాలి.

పంచామృత స్నానం :

మధ్వాజ్య క్షీరదధిభిః స గుడై ర్మంత్ర సంయుతైః ।
పంచామృతైః పృథక్స్నానైః సించామి త్వాం కపీశ్వర ॥

ఇచట పంచామృత మంత్రాలు చెబుతూ. కలిపిన పంచామృతా లను స్వామివారిపై కొద్దిగా చల్లాలి పుష్పముతో.

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః। పంచామృత స్నానం సమర్పయామి.

స్నానం :-

గంగా గోదావరే ముఖ్య నదీభ్యస్సముపాహృతం ।
జలం దదామి స్నానార్థం స్వీకురుష్వ హరీశ్వర ॥
యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత ।
వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥
ఆదిత్యవర్ణే తపసోధిజాతో వనస్పతి స్తవ వృక్షోథ బిల్వః ।
తస్యఫలాని తపసానుదంతు మాయా స్తరాయాశ్చ
బాహ్యా అలక్ష్మీః ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- శుద్ధోదక స్నానం సమర్ప యామి. కొద్దిగా మంచినీటిని స్వామివారిపై చల్లవలెను.

వస్త్రం :-

పట్టవస్త్ర యుగం దేవ ప్రయచ్ఛామి తవప్రభో ।
ప్రీత్యర్థం పావనే మహ్యాం ప్రసీద కరుణాకర ॥
సప్తాస్యాసన్ పరిధయః త్రిస్స ప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుం ॥
ఉపైతు మాం దేవ సఖః కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమ్మృద్ధిం దదాతుమే ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః. స్నానానన్తరం వస్త్ర యుగ్మం సమర్పయామి. వస్త్రయుగ్మ ధారణానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి. ఏదేని ఒక వస్త్రమును స్వామివారికి సమర్పించవలెను.

బ్రహ్మసూత్రం :-

రాజితం బ్రహ్మసూత్రంచ నిర్మితం బ్రహ్మణాపురా ।
ప్రీత్యర్థం తవ దాస్యామి సంగృహాణ కపీశ్వర ॥

తం యజ్ఞం బర్హిషిప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః ।
తేనదేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥
క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం ర్నాశయామ్యహం।
అభూతిమసమృద్ధించ సర్వాన్నిర్ణుద మే గృహాత్ ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః- బ్రహ్మసూత్రం సమర్ప యామి. ఇచట పత్తితో చేసిన యజ్ఞోపవీతం సమర్పించాలి; లేనిచో అక్షతలో- పూలో- సింధూరమో ఏదోఒకటి సమర్పించాలి!

శ్రీచందనం :-

చందనం రోచనామిశ్రం హరిద్రా కుంకుమాన్వితం ।
స్వీకురుష్వ దయాసింధో మయార్పితమిదం ప్రభో ॥
తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సమ్భృతం పృషదాజ్యం ।
పశూగ్‌స్తాగ్‌శ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్గ్రామ్యాశ్చయే॥
గంధద్వారాందురా ధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ।
ఈశ్వరీగ్‌ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం ॥

శ్రీ సువర్చలాసమేత హనుమతే నమః- గంధాన్ ధారయామి. ఇచట మంచి గంధం లేదా రక్తచందనం ఏదోఒకటి సమర్పించాలి.

కౌపీనం :-

పీత కౌశేయ కౌపీనం ధార్యం చ బ్రహ్మచారిభిః ।
అర్పయామి మహాబాహో గృహాణ పవనాత్మజ ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- కౌపీనం సమర్పయామి.

అక్షతలు :-

అక్షతాస్తవ దాస్యామి హరిద్రాక్తాన్ శుభప్రదాన్ ।
రామప్రియ నమస్తుభ్యం సంగృహాణ అంజనాసుత ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- కుంకుమ అక్షతాన్ సమర్పయామి. కుంకుమ కలిపిన అక్షతలను స్వామివారిపై చల్లవలెను.

అభరణాలు :

కిరీటహార కేయూర కటకాంగుళి ముద్రికాః ।
ధారయస్వ మయా దత్తాః భక్త్యా కపికులోత్తమ ॥
తస్మాద్యజ్ఞాత్సర్వహృతః ఋచః సామాని జజ్ఞిరే ।
ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత ॥
మనసః కామమాకూతిం వాచస్సత్యమశీమహి ।
పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీశ్రియతాం యశః ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః. అలంకరణార్థం దివ్యాభరణాని సమర్పయామి. ఇచట యథాశక్తి రత్న, సువర్ణ, రజత అభరణాలు సమర్పించవలెను. సింధూరం, పుష్పాలైన సమర్పించవలెను.

పుష్పాలు :

చంపకారక్త పున్నాగ జాజీ మందార చంపకైః ।
త్వాం పూజయామ్యహం భక్త్యా సుప్రసీద అంజనాసుత ॥
తస్మాదశ్వా అజాయంత యేకేచోభయాదతః ।
గావోహ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః ॥
కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమా ।
శ్రియం వాసయమేకులే మాతరం పద్మమాలినీం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- వివిధాని పుష్పాణి సమర్పయామి. దోసిటనిండా పూలను తీసుకుని స్వామివారిపై చల్లవలెను.

15 )

**అథాంగపూజా :**

ఓం హనుమతే నమః - పాదౌ పూజయామి ।
,, గూఢ గుల్ఫాయ నమః - గుల్ఫౌ పూజయామి ।
,, అంజనాగర్భ సంభూతాయ నమః-జంఘే పూజయామి।
,, అతిబలపరాక్రమాయ నమః - ఊరూ పూజయామి ।
,, ఉదధి లంఘనాయ నమః - కటిం పూజయామి ।
,, సీతాశోకాపహారిణే నమః - నాభిం పూజయామి ।
,, కాలనేమి మథనాయ నమః - హృదయం పూజయామి ।
,, మకరీ విపాటనాయ నమః - స్తనౌ పూజయామి ।
,, సంజీవన ధరాధర ధారిణే నమః- బాహూ పూజయామి ।
,, సుగ్రీవ సచివాయ నమః - గ్రీవం పూజయామి ।
,, లక్ష్మణప్రాణదాత్రే నమః - ముఖం పూజయామి ।
,, భవిష్యద్బ్రహ్మణే నమః - శిరః పూజయామి ।
,, భక్తాభీష్టప్రదాయకాయ నమః - సర్వాణి అంగాని పూజయామి ।

ఇచట అంజనేయ, సువర్చలా అష్టోత్తరాలతో పూజించాలి. ఆ అష్టోత్తరాలు తరువాయి పేజీలో వ్రాయబడినవి, గమనించగలరు.

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి. నానావిధ పరిమళ పత్రపుష్ప అక్షతాన్ సమర్పయామి. సింధూరం చ సమర్పయామి.

**ధూపం :**

వనస్పతి సముద్భూతై ర్గంధాఢ్యై స్సుమనోహరైః ।
గుగ్గులాద్యై స్సమోపేతః ధూపోయం ప్రతిగృహ్యతాం ॥
యత్పురుషం వ్యదధుః కతిథావ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌబాహూ కావూరూపాదా వుచ్యేతే ॥

అపప్రజంతు స్నిగ్ధాని చక్లీత వస మే గృహే ।
నిచదేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- దూప మాఘ్రాపయామి. ఇచట సాంబ్రాణి కడ్డీలు వెలిగించి పొగను చూపించాలి. లేదా సాంబ్రాణి ఖిళ్ళలను వెలిగించి ధూపం స్వామివారికి చూపాలి.

దీపం :

సర్వవర్తిత్రయోపేతం గోఘృతేన ప్లుతం శుభం ।
సకల ధ్వాంత హరణం దీపంతే దర్శయామ్యహం ॥

బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః ।
ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం సువర్ణాం హేమమాలినీం ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- సాక్షాత్ దీపం దర్శయామి- ఇచట ఏకపత్తి హారతి యీయవలెను. ధూపదీపానన్తరం శుద్ధ అచమనీయం సమర్పయామి.

నైవేద్యం :

నైవేద్యం షడ్రసోపేతైః భక్ష్యైర్భోజ్యైస్సమన్వితం ।
మధురైర్మృదులైర్నిత్యం అర్పయామ్యరిమర్దన ॥

చంద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత ।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ॥

ఆర్ద్రాం యః కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీం ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి-ధియోయోనః ప్రచోదయాత్ కుడిచేతిలో పుష్పము నుంచుకొని ఎడమ చేతితో కలశోదకాన్ని కుడిచేతిలో పోసుకుని నైవేద్య పదార్థాల మీద చల్లి-

సత్యం త్వర్తేన పరిషించామి అని కుడిచేతిలో నీటిని పోసుకుని నివేదన పదార్థాల చుట్టూ పోయాలి. శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః మహా నైవేద్యం సమర్పయామి. ఇచట నివేదించే పదార్థాల పేరులు చెప్పాలి. నారికేళ శకలసహిత గుడపిష్ట గుడోదకాన్ నివేదయామి. అపూపాన్ నివేదయామి. రంభాఫలాన్ నివేదయామి. చూతఫలాన్ నివేదయామి. కుడిచేతికి ఎడమచేయి కలిపి నైవేద్యమును స్వామివారికి చూపుచు-

ఓం ప్రాణాయ స్వాహా ఓం అపానాయ స్వాహా
ఓం వ్యానాయ స్వాహా ఓం ఉదానాయ స్వాహా
ఓం సమానాయ స్వాహా- మధ్యే మధ్యే ఉదక పానీయం
సమర్పయామి
సమర్పయామి పానీయం మధ్యే మధ్యే సుధోపమం।
సచ్చిదానందరూపాయ సృష్టి స్థిత్యంత హేతవే ॥

అమృతా పిధానమసి ఉత్తరా పోశనం సమర్పయామి. హస్తౌ ప్రక్షాళయామి. పాదౌ ప్రక్షాళయామి. శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

తాంబూలం :

పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥
నాభ్యా ఆసీదంతరిక్షం శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్పయన్॥

తాంమ ఆవహ జాతవేదో లక్ష్మీమనప గామినీం ।
యస్యాం హిరణ్యం ప్రభూతంగావోదాశ్యోశ్వాన్
విందేయం పురుషానహం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- తాంబూలం సమర్ప యామి.

నీరాజనం :

స్వర్ణపాత్రస్థితం చారు ప్రదీప్తం తిమిరాపహం ।
కర్పూరహారతిం దివ్యం స్వీకురుష్వ శివాంశజ ॥

వేదాహమేతం పురుషం మహాన్తం అదిత్యవర్ణంత మనస్తుపారౌ ।
సర్వాణి రూపాణి విచిత్యధీరః నామాని కృత్వాభివదన్ యదాస్తే॥

యశ్శుచిః ప్రయతోభూత్వా జుహుయాదాజ్య మన్వహం ।
శ్రియఃపంచ దశర్చంచ శ్రీకామస్సతతం జపేత్ ॥
హిరణ్యపాత్రం మధోః పూర్ణం దదాతి మధవ్యోసానీతి
ఏకధా బ్రహ్మణముపహరతి ఏకధైవ యజమాన ఆయుస్తే
జోదదాతి

సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠికం
రాజ్యం మహారాజ్య మాధిపత్యం.
సంతత శ్రీరస్తు సమస్త సన్మంగళాని భవంతు
నిత్య శ్రీరస్తు. నిత్య సన్మంగళాని భవంతు

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- ఆనంద కర్పూర నీరాజ నం సమర్పయామి.

పుష్పాంజలి :

మందారైః పారిజాతైశ్చ మల్లికాభిశ్చ చంపకైః ।
పుష్పాంజలిం ప్రదాస్యామి స్వర్ణపద్మై స్సమర్పితం ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- పుష్పాంజలిం సమర్ప యామి.

మంత్రపుష్పం :

ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః ।
తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతే అయనాయః ।

సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వసమ్భువం ।
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదం ।
విశ్వతః పరమాం నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం ।
విశ్వమే వేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి ।
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం ।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం ।
నారాయణ పరోజ్యోతిరాత్మా నారాయణః పరః ।
నారాయణ పరంబ్రహ్మ తత్వం నారాయణః పరః ।
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ।
యచ్చ కిఞ్చిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా ।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః ।
అనంతమవ్యయం కవిగ్ం సముద్రేన్తం విశ్వశమ్భువం ।
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం ।
అధోనిష్ట్యాసి తస్యాన్తే నాభ్యాముపరితిష్ఠతి ।
జ్వాల మాలా కులంభాతి విశ్వస్యాయతనం మహత్ ।
సన్తతగ్ం శిలాభిస్తులమ్బత్యా కోశ సన్నిభం ।
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితం ।
తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతో ముఖః ।
సోగ్రభుగ్విభజం స్తిష్టన్నాహార మజరః కవిః ।

తిర్యగూర్ధ్వమథశ్శాయీ రశ్మయస్తస్య సన్తతాః ।
సన్తాపయతి స్వన్దేహ మాపాదతల మస్తకః ।
తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ।
నీలతోయద మధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవార శూకవత్తన్వీపీతా భాస్వత్యణూపమా ।
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।
స బ్రహ్మ స శివస్సహరిస్సేన్ద్రస్సోక్షరః పరమస్స్వరాట్।

రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే ।
నమో వయంవై శ్రవణాయ కుర్మహే ।
సమే కామాన్ కామకామాయ మహ్యం ।
కామేశ్వరో వైశ్రవణో దదాతు ।
కుబేరాయ వైశ్రవణాయ ।
మహారాజాయ నమః ।

ఓం తద్బ్రహ్మ । ఓం తద్వాయుః । ఓం తదాత్మా ।
ఓం తత్సత్యం । ఓం తత్సర్వం । ఓం తత్పురోం నమః ।
అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు । త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః । త్వం తదాప ఆపో జ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ।
ఈశానస్సర్వ విద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తు సదా శివోమ్।
ఆంజనేయాయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి ।
తన్నో హనుమాన్ ప్రచోదయాత్ ।

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి.

ఆత్మ ప్రదక్షిణ :

ప్రదక్షిణం కరోమి త్వాం భక్తియుక్తేన చేతసా ।
బహుజన్మార్జితం పాపం శమయే ద్వాయునందన ॥

యాని కాని చ పాపాని జన్మాన్తర కృతాని చ ।
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ॥

పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసమ్భవః ।
త్రాహి మాం కృపయాదేవ శరణాగత వత్సల ॥

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణ మ్మమ ।
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వర ॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

సాష్టాంగ నమస్కారం :

రామదూత నమస్తుభ్యం సీతాశోక వినాశక ।
లక్ష్మణస్య ప్రాణదాతా కురుమద్వాంఛితం ఫలం ॥

వాయునందన సుగ్రీవ సచివ అర్ణవలంఘన ।
దుష్టరాక్షస దర్పఘ్న కురు మద్వాంఛితం ఫలం ॥

అంజనాగర్భ సంభూత లంకాప్రాణాపహారక ।
రావణోద్యాన విధ్వంసిన్ కురు మద్వాంఛితం ఫలం ॥

ప్రసన్నో భవమే స్వామిన్ ప్రపన్నార్తి ప్రభంజన ।
త్వత్పాద సన్నిధిం ప్రాప్తం పాహిమాం కరుణాకర ॥

ఈ శ్లోకములను చదువుచూ ఐదుసారులు సాష్టాంగ నమస్కారము చేయవలెను.

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి.

ఛత్రాది సమర్పణమ్ :

నృత్యం గీతంచ వాద్యంచ కృతం గంధర్వసత్తమైః ।
ప్రకల్పయామి మనసా రామదూతాయతే నమః ॥
రాజోపచారై స్సతతం పురాణ పఠనాదిభిః ।
సంతుష్టోభవ సర్వాత్మన్ సర్వలింగ మయాత్మక ॥

ఛత్రం సమర్పయామి- చామరం వీజయామి- నృత్యం సమర్పయామి- గీతం శ్రావయామి- నాట్యం దర్శయామి- శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- సమస్త రాజోపచార- దేవోపచార- భక్త్యోపచార- శక్త్యోపచారాన్ సమర్పయామి.

అపరాధం :

ఉమాధీశ తేజో సముద్భూత నిత్యం
మమాభీష్ట సిద్ధిం కురుష్వ ప్రసన్నః ।
నమామి త్వదీయాంఘ్రి యుగ్మారవిందం
సమస్తాపరాధం క్షమస్వ ప్రభో మే॥

శ్రీ సువర్చలా సమేత హనుమతే నమః- మమ సమస్త అపరాధాని హే ప్రభో! క్షమస్వ.

ఆంజనేయార్పణం :

యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే కపీశ్వరం ॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సమీరజ ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనయా ధ్యానా వాహనాది షోడశోపచార పూజాయాచ భగవాన్ సర్వాత్మకః సర్వం శ్రీ సువర్చలా సమేత హనుమాన సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు. సర్వం శ్రీ సువర్చలా సమేత హనుమదర్పణమస్తు. ఏతత్ఫలం శ్రీ సువర్చలా సమేత ఆంజనేయార్పణమస్తు.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై
శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి ॥

**ఉద్వాసనం :**

యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః
తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తేహ నాకం మహిమానస్సచన్తే
యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః ॥

ప్రయాతు భగవాన్ దేవ సర్వదేవ నమస్కృతః ।
అనేన పూజావిధినా తృప్తః పునరాగమనాయచ ॥

**సర్వం శ్రీ ఆంజనేయార్పణమస్తు.**

**స్వస్తి.**

# హనుమత్ వాలాగ్ర పూజా విధానం

స్వామివారి మహిమలు అనంతాలు. మారుతాత్మజుని అనుగ్రహమును పొందుటకు ఎన్నెన్నో విధానాలు చెప్పబడినై. అందులో పూజావిధానం ఒక పద్ధతి. సాధకుడు కార్యసిద్ధిని త్వరితంగా పొందు మార్గాలలో వాలాగ్ర పూజావిధానం ప్రధానమైనది అని అనుభవజ్ఞుల అభిప్రాయం. దీక్షతో, శ్రద్ధాభక్తులతో విధివిధానముగ విసుగులేక ఆచరించటం ముఖ్యం. వాలాగ్ర పూజకు సంతుష్టులై స్వామివారు ప్రసన్నులౌతారు.

ఈ మహావీరుని దీర్ఘలాంగూలము కలిగిన చిత్రమును తీసుకుని తోక మొదటినుండి చివరివరకు రోజుకొక బొట్టుచొప్పున పెట్టుచుండవలెను. అలా పెట్టుట పూర్తయిన తరువాత వాలమును శుభ్రము చేసి మరల తిరిగి యీసారి వాలము చివరనుండి మొదలువరకు రోజుకొక బొట్టును పెట్టుచుండవలెను. ఇది అనులోమ, విలోమ విధానం. బొట్టు పెట్టునపుడు లాంగూల స్తోత్రం (దీనిని లాంగూలాస్త్రం అని అంటారు) పఠించవలెను. పూజించే లాంగూలానికి ఏ వస్త్రమూ ఆచ్ఛాదనగా ఉండరాదు. కొన్ని చిత్రాలలో తోకచివర గంట ఉండుట కద్దు. అదికూడా పనికిరాదు-ఉండరాదు. స్వామివారికి ప్రీతికరమైన పదార్థాలనే నైవేద్యానికి వాడాలి. ఇది మండల దీక్షతో ఆపకుండా ఒక నియమంగా ఆచరించాలి. సహజంగా సాధకులు కొన్ని నియమాలు పాటించాలి. అంటే బ్రహ్మచర్యం, భూశయనం, ఏకభుక్తం ఇలాంటివి. పెద్దల సలహాలను పాటించాలి.

చివరిరోజున స్వామివారి ప్రసన్నతకై నాగవల్లీ దళాలతో (తమలపాకులతో) సహస్రనామసహిత షోడశోపచార పూజ జరపాలి. ఇష్టులైనవారికి సంతృప్తిగ భోజనము పెట్టవలెను. ఇది మహామహిమోపేతము.

(స్వామివారికి నమస్కరించి- దీపారాధన చేసి విఘ్నేశ్వరుని పూజించి యథాస్థానమునకు పంపిన తరువాత ఆచమించి) సంకల్పం చెప్పుకుంటూ (ఇవన్నీ గడచిన పేజీలలో షోడశోపచార పూజా విధానం మొదట్లో ఉన్నవి. గమనింపగలరు.)

శీఘ్రమేవ మనోవాంఛాఫల సిద్ధ్యర్థం హనుమద్దేవతా వాలాగ్ర పూజాం కరిష్యే. (నీటిని తాకవలెను.) కలశారాధనం కరిష్యే.

గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతీ
నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు.

కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య దేవం సంప్రోక్ష్య ఆత్మానం సంప్రోక్ష్య (పూజించిన కలశంలోని నీటిని తమలపాకుచే పూజించే వస్తువులమీద, దేవునిమీద, తనపైన, ప్రక్కన భార్యవుంటే ఆమెపైన చల్లవలెను )

స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం
తావత్త్వం ప్రీతి భావేన బింబేస్మిన్ సన్నిధిం కురు.

(పుష్పాక్షతలు స్వామివారిపై చల్లి నమస్కరింపవలెను.)

ధ్యానం :

వామే కరే వైరిభిదం వహంతం శూలం పరే శృంఖల
హారటంకం
దధాన మచ్ఛాచ్ఛ సువర్ణవర్ణం భజే జ్వాలత్కుండల
మాంజనేయం

పద్మరాగమణి కుండలత్విషా పాటలీకృత కపోల మండలం
దివ్య హేమ కదళీ వనాంతరే భావయామి పవమాన నందనం.

మండలీకృత వాలాగ్రం స్వర్ణవర్ణం మహా హనుం
కుండలాలంకృతం శూరం భజే వాయుసూతం హృది.

శ్రీ హనుమతే నమః- ధ్యాయామి, ధ్యానం సమర్పయామి.
(నమస్కరిస్తూ పై శ్లోకాలను చదువవలెను.)

ఓం మర్కటాధిపాయ నమః- వాలాగ్రే ఆవాహయామి ఆవాహనం
సమర్పయామి (అక్షతలు చల్లవలెను)

ఓం అక్షక్షపణాయ నమః - వాలాగ్రే సింహాసనం సమర్పయామి.
(అక్షతలు చల్లవలెను)

ఓం రుద్రావతారాయ నమః - ,, పాద్యం సమర్పయామి
(నీళ్ళు చల్లవలెను)

ఓం శ్రీరామదూతాయ నమః - ,, అర్ఘ్యం సమర్పయామి.
(నీళ్ళు చల్లవలెను)

ఓం సుగ్రీవ సఖాయ నమః- ,, ఆచమనీయం సమర్పయామి.
(నీళ్ళు చల్లవలెను)

ఓం సీతాదుఃఖహారిణే నమః- ,, మధుపర్కం సమర్పయామి.
(నీళ్ళు చల్లవలెను)

ఓం రావణ కులాంతకాయ నమః- ,, స్నానం సమర్పయామి. ,,

ఓం భీమ రూపాయ నమః - ,, వస్త్రం సమర్పయామి.
(అక్షతలు చల్లవలెను)

ఓం వజ్రాంగాయ నమః - ,, యజ్ఞోపవీతం సమర్పయామి.
(అక్షతలు చల్లవలెను)

ఓం లక్ష్మణ ప్రాణదాయినే నమః- ,, శ్రీగంధాన్ ధారయామి.
(గంధం చల్లవలెను)

ఓం సీతాశీర్వాద సంపన్నాయ నమః- ,, కుంకుమాన్ విలేప
యామి (కుంకుమబొట్టు పెట్టాలి)

ఓం శ్రీరామ భక్తాయ నమః- ,, పుష్పాణి సమర్పయామి
(పూలతో పూజించాలి)

ఓం హనుమతే నమః- ఓం అంజనాసూనవే నమః- ఓం వాయుపుత్రాయ నమః- ఓం మహాబలాయ నమః- ఓం రామేష్టాయ నమః- ఓం ఫల్గుణ సఖాయ నమః- ఓం పింగాక్షాయ నమః- ఓం అమిత విక్రయాయ నమః- ఓం ఉదధిక్రమణాయ నమః- ఓం సీతాశోక వినాశనాయ నమః- ఓం లక్ష్మణ ప్రాణ దాతాయ నమః- ఓం దశగ్రీవ దర్పాపహాయ నమః- శ్రీ హనుమతే నమః,

(ఈ నామాలను పూలతో (ఎరుపు) పూజించవలెను.

నానావిధ పరిమళ పుష్పాన్ సమర్పయామి. అక్షతాన్ సమర్ప
యామి. (అక్షతలు-గంగ సింధూరం కలిపినవి)

ఓం కపీంద్రాయ నామః - వాలాగ్రే ధూపం సమర్పయామి.
(ధూపం వేయవలెను)

ఓం బ్రహ్మాస్త్ర నివారకాయనమ - వాలాగ్రే దీపం దర్శయామి.
(దీపం చూపవలెను)

ఓం అశోక వనహంత్రే నమః- వాలాగ్రే నైవేద్యం సమర్పయామి.
- మధుక్షీర రంభాఫలాన్ నివేదయామి.

ఓం అంగద సఖాయ నమః- వాలాగ్రే తాంబూలం సమర్పయామి.
(తాంబూలం సమర్పించవలెను)

ఓం లంకాపురీ విదాహకాయనమః- వాలాగ్రే కర్పూర నీరాజనం
సమర్పయామి. (కర్పూర హారతి నీయవలెను)

ఓం తత్వజ్ఞాయ నమః- వాలాగ్రే మంత్రపుష్పం సమర్పయామి.
(మంత్రపుష్పం సమర్పించవలెను)

ఓం సర్వ దుఃఖహరాయ నమః- వాలాగ్రే ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (ఐదుసార్లు ప్రదక్షిణ చేస్తూ)

యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే
పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాప సంభవః
త్రాహి మాం కృపయాదేవ శరణాగత వత్సలా
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష కపీశ్వరా.
(ఈ శ్లోకములను పఠించవలెను.)

యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజాః క్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాంతి సద్యో వందే తమచ్యుతం.
మంత్ర హీనం క్రియా హీనం భక్తి హీనం కపీశ్వరా
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తథస్తుతే.

అనయా ధ్యానావాహనాది కల్పోక్త ప్రకార శ్రీ హనుమద్వాలాగ్ర పూజయా భగవాన్ సర్వాత్మకః సర్వం శ్రీ హనుమద్దేవతార్పణ మస్తు. (పుష్పాక్షతలను నీటిలో తడిపి స్వామివారి పాదాలచెంత ఉంచి నమస్కరించవలెను.)

## లాంగూల స్తోత్రం

లాంగూల స్తోత్రము మహా మహిమాన్వితమైనది. ఈ స్తోత్ర పారాయణ వలన కార్యసిద్ధి కలుగును. లాంగూలము అంటే తోక అని అర్థము. ఆంజనేయస్వామి తన లాంగూలముతో ఎందరో రాక్షసులను మర్దించెను. లంకాదహన మొనరించెను. ఈ జగత్తులో యీ స్తోత్ర పరాయణ వలన కానిపని అంటూ ఏదీలేదు.

చదువురానివారికి చదువు వస్తుంది. వివాహం కానివారికి వివాహం. సంతానం లేనివారికి సంతానం. లౌకిక విషయాలలో తప్పకుండ వారినే విజయలక్ష్మి వరిస్తుంది. రావిచెట్టు క్రింద కూర్చుని మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా- నియమంగా- ఓర్పుతో పారాయణ చేస్తే- శత్రుంజయుడు కాగలడు. కుటుంబ కలతలు నశించును. అన్నివిధములా శ్రేయోదాయకమైన స్తోత్రమిది.

శ్రీమంతం హనుమంత మాత్తరిపుభిర్భూభృత్తరు భ్రాజితం
చాల్పద్వాలధి బద్ధవైరి నిచయం చామీకరాద్రి ప్రభం
రోషాద్రక్త పిశంగ నేత్ర నవినం భ్రూభంగ మంగ స్ఫుర
త్ప్రోద్యచ్చండ మయూఖ మండల ముఖం దుఃఖాపహం
దుఃఖినాం.

కౌపీనాం కటిసూత్ర మౌంజ్యజినయుగ్దేహం విదేహాత్మజా
ప్రాణాధీశ పదారవింద నిహితస్వాంతం కృతాంతం ద్విషాం
ధ్యాత్వైవం సమరాంగణస్థిత మథానీయ స్వహృత్పంకజే
సంపూజ్యాఖిల పూజనోక్తవిధినా సంప్రార్థయేత్ప్రార్థితం.

హనుమన్నంజనీసూనో మహాబల పరాక్రమ
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

మర్కటాధిప మార్తాండ మండలగ్రాస కారక
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

అక్షక్షపణ పింగాక్ష దితిజాశు క్షయంకర
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

రుద్రావతార సంసార దుఃఖభారాపకారక
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

శ్రీరామ చరణాంభోజ మధుపాయిత మానస
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

వాలి ప్రమథనక్లాన్త సుగ్రీవోన్మోచన ప్రభో
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

సీతా విరహ వారీశ మగ్నసీతేశ తారక
లోలల్లాంగూలపాతేన మమారాతీన్నిపాతయ.

రక్షోరాజ ప్రతాపాగ్ని దహ్యమాన జగద్వన
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

గ్రస్తాశేష జగత్స్వాస్థ్య రాక్షసాంభోధి మంథర
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

పుచ్ఛ గుచ్ఛ స్ఫుర ద్వీర జగద్దగ్ధారి వత్తన
లోలల్లాంగూలపాతేన మమారాతీన్నిపాతయ.

జగన్మనోదురుల్లంఘ్య పారావార విలంఘన
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

స్మృతమాత్ర సమస్తేష్ట పూరకప్రణతప్రియ
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

రాత్రించర చమూరాశి కర్తనైక వికర్తన
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

జానకీ జానకీ జాని ప్రేమపాత్ర పరంతప
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

భీమాదిక మహావీర వీరావేశావతారక
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

వైదేహీ విరహక్లాన్త రామరోషైక విగ్రహ
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

వజ్రాంగ నఖ దంష్ట్రేశ వజ్రి వజ్రావ గుంఠన
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ,

అఖర్వ గర్వ గంధర్వ పర్వతోద్భేదన స్వర
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

లక్ష్మణ ప్రాణ సంత్రాణ త్రాత తీక్ష్ణ కరాన్వయ
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

రామాది విప్రయోగార్త భరతాద్యార్తి నాశన
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

ద్రోణాచల సముత్క్షేప సముత్క్షిప్తారి వైభవ
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

సీతాశీర్వాద సంపన్న సమస్తావయవాక్షత
లోలల్లాంగూల పాతేన మమారాతీన్నిపాతయ.

ఇత్యేవ మశ్వత్థతలోపవిష్టః
శత్రుంజయం నామ పఠేత్ స్వయం యః
స శీఘ్రమేవాస్త సమస్త శత్రుః
ప్రమోదతే మారుతజ ప్రసాదాత్.

# హనుమత్ బడబానల స్తోత్రం

ఓం అస్య శ్రీ హనుమద్బడబానల స్తోత్ర మంత్రస్య శ్రీరామ చంద్ర ఋషిః శ్రీ బడబానల హనుమాన్ దేవతా మమ సమస్త రోగ ప్రశమనార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం సమస్త పాపక్షయార్థం సీతా రామచంద్ర ప్రీత్యర్థం హనుమద్బడబానల స్తోత్ర జపమహం కరిష్యే.

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే శ్రీ మహా హనుమతే ప్రకట పరాక్రమ సకల దిఙ్మండల యశోవితాన ధవళీకృత జగత్రితయ వజ్రదేహ రుద్రావతార లంకాపురీ దహన ఉమా అనల మంత్ర ఉదధి బంధన దశశిరః కృతాంతక సీతాశ్వాసన వాయుపుత్ర అంజనీగర్భ సంభూత శ్రీరామ లక్ష్మణానందకర కపి సైన్య ప్రాకార సుగ్రీవ సాహాయ్య కరణ పర్వతోత్పాటన కుమార బ్రహ్మచారిన్ గంభీర నాద సర్వపాపగ్రహ వారణ సర్వ జ్వరోచ్చాటన డాకినీ విధ్వంసన ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే మహావీరాయ సర్వదుఃఖ నివారణాయ గ్రహమండల సర్వ భూత మండల సర్వ పిశాచ మండలోచ్చాటన భూత జ్వరై కాహిక జ్వర ద్వ్యాహిక జ్వర త్ర్యాహిక జ్వర చాతుర్థిక జ్వర సంతాప జ్వర విషమ జ్వర తాప జ్వర మహేశ్వర వైష్ణవ జ్వరాన్ ఛింది ఛింది భింది భింది యక్ష రాక్షస భూత ప్రేత పిశాచాన్ ఉచ్చాటయ ఉచ్చాటయ ఓం హ్రాం శ్రీం నమో భగవతే శ్రీ మహా హనుమతే ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆం హాం హాం హాం జౌం సౌం ఏహి ఏహి ఓం హం ఓం హం ఓం హం ఓం నమో భగవతే శ్రీ మహా హనుమతే శ్రవణ చక్షుర్భూతానాం శాకినీ డాకినీ విషమ దుష్టానాం సర్వవిషం హర హర ఆకాశ భువనం భేదయ భేదయ ఛేదయ ఛేదయ మారయ మారయ శోషయ శోష మోహయ మోహయ జ్వాలయ జ్వాలయ ప్రహారయ ప్రహా సకల మాయాం భేదయ భేదయ ఓం హ్రాం హ్రీం భగవతే మహా హనుమతే సర్వగ్రహోచ్చాటన పర

క్షోభయ సకల బంధన మోక్షణం కురు కురు శిరః శూల గుల్మ
శూల సర్వశూల నిర్మూలయ నిర్మూలయ నాగపాశానంతవాసుకి
తక్షక కర్కోటక కాళీయాన్ యక్షకుల జలగత బిలగత రాత్రిం
చర దివాచర సర్పాన్నిర్విషం కురు కురు స్వాహా. రాజభయ చోర
భయ పరయంత్ర పరమంత్ర పర తంత్ర పరవిద్యాశ్ఛేదయ
చ్ఛేదయస్వ మంత్ర స్వ యంత్ర స్వ విద్యాః ప్రకటయ ప్రక
టయ సర్వారిష్టాన్నాశయ నాశయ సర్వశత్రూన్నాశయ నాశయ
అసాధ్యం సాధయ సాధయ హుం ఫట్ స్వాహా.

ఈ బడబానల స్తోత్ర పారాయణ వలన సాధకులు శారీర
వ్యాధుల నుండి బయటపడగలరు. మానసిక ప్రశాంతత కల
గును పై అధికారులవలన కలుగు అవమానాలు తొలగును
భయాలు, సందేహాలు తొలగిపోవును. ఏకాగ్రత కుదురు
కుటుంబ చిక్కులు విడిపడును. అద్భుత ఫలప్రదాయిని. వి
సం, భక్తి, శ్రద్ధ, ఓర్పులతో దీక్షాబద్ధుడై పారాయణ చే
మారుతాత్మజుని అనుగ్రహపాత్రుడు కాగలడు.

ఏతత్ఫలం శ్రీ సువర్చలా సమేత అంజనేయస్వామి
తార్పణమస్తు.

## మంగళం

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం ॥
విశ్వామిత్రాంతరంగాయ మిథిలా నగరీ పతేః
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళం
పంచాననాయ భీమాయ కాలనేమి హరాయ చ
కౌండిన్య గోత్ర జాతాయ మంగళం శ్రీ హనూమతే॥
ఆపదామ పహర్తారం దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమా



## రాయప్రోలు రథాంగపాణి

తల్లిదండ్రులు : బుధరంజని, బుచ్చిరామయ్య

జననం : వేమూరు మండలం; జంపని గ్రామం

విద్య : భాషాప్రవీణ

వృత్తి : గ్రేడ్ I తెలుగు పండిట్
జిల్లా పరిషత్ హైస్కూలు, కొల్లూరు.

వ్యాసంగము : అధ్యాత్మికత, హనుమదారాధన

రచనలు : వ్యాకరణ పారిజాతము, హనుమద్వైభవం
హనుమద్విజయము, మానవధర్మశాస్త్రము
భారతీయ కామకళాశాస్త్రము, హాస్యకథలు
తెలుగు వెలుగు.